

ఎంత ప్రత్యేకమైన డిజైనులు!
ఎంత మనోహరమైన రంగులు...
ఇవన్నీ

**Wintex®**

## వింటెక్స్ బట్టలు

మీరు కావాలనుకొనే డిజైనులు, మీకు నచ్చిన రంగులలో లభిస్తున్నాయి. ఈ మనోహరమైన, ప్రత్యేకమైన డిజైనులు ప్రతి నెలా మార్చబడుతూ ఉంటాయి. ఆధునిక ఫ్యాషనుకు అనువుగా మీరు స్నేహితురాండ్రతో... మీ కుటుంబముతో...లేక మీ భర్తతో ఉన్నపుడు ఎక్కువ సొగసుగా కనపడతారు.

- మీరు బజారుకు వెళ్లినపుడు మీ జీవిత భాగస్వామికి ఆధునిక ఫ్యాషనువైన షర్టింగ్ మరియు సూటింగ్ కొనిపెట్టండి.

వింటెక్స్—మారుతున్న ఫ్యాషను ప్రపంచములో నేడు మరియు భావికి అనువైన బట్టలు

ఇంకా, ఆకర్షణీయమైన జార్జెట్లు, ప్రోవేద్లు, క్రేపో, సాదావి మరియు ప్రింటు చీరలు, ఫ్రాక్, బ్లౌజులకు తగిన బట్టలు లభిస్తున్నాయి. ఇవన్నీ నాణ్యమైన కృత్రిమమైన ఫైబర్సునుండి నేయబడుతున్నాయి.

**వింటెక్స్ మిల్స్**
వింటెక్స్ రోడ్, సూరత్.

everest/298b/WM tl

ఏజెంటు: మెసర్సు గోయల్ ట్రేడర్స్, 24/48, గొడవున్ వీధి, మద్రాస్—1.



## 7 రోజులలోనే సీత తన చర్మమును స్వచ్ఛంగా, మనోహరంగా చేసుకొన్న కథ!

# 7-రోజుల పాండ్స్ సౌందర్య చర్యా యొక్క చమత్కారము



కాలేజి సోషల్‌కి ఇంక 7రోజులే వున్నాయి! కాని, ఎండి వాడి పోయిన చర్మముతో పార్టీకి ఎల్లాగ వెళ్లగలుగుతాను .అని చింత కలిగింది. అదృష్టవశాత్తు 7రోజుల పాండ్స్ సౌందర్య చర్యను గురించి విన్నాను.



ఒక వారం రోజుల పాటు, రాత్రి పడుక్కునే ముందు పాండ్స్ కోల్డ్ క్రీమను రెండు సార్లు నా ముఖానికి రాసుకున్నాను. మొదటి సారి రాయడంతో పైమురికి, మేక్-అప్ తొలగిపోతాయి.



తరువాత మెత్తటి టిస్యూ పేపర్‌తో గాని, గుడ్డతో గాని క్రీమను తుడిచి వేశాను.



రెండవసారి నా ముఖానికి యింకా క్రీమ్ రాసుకొన్నాను. నిజానికి యిదే సౌందర్య రహస్యము. ఎందుకంటే, ఈ సారి క్రీమ్ చర్మములోకి పోయి మరుగు పడివున్న మురికిని తొలగించును.




7 రోజుల తరువాత, పార్టీలో నా చర్మము అత్యద్భుతంగా, స్వచ్ఛంగా మెరిసిపోయింది! ఇప్పుడు ప్రతి రోజూ పాండ్స్ కోల్డ్ క్రీమ్‌తో చర్మాన్ని శుభ్రపరుస్తున్నాను. అందు వలననే, నా ముఖ వర్చస్సు ఎల్లప్పుడు స్వచ్ఛంగా, మనోహరంగా కనబడుతుంది.

# పాండ్స్
## కోల్డ్ క్రీమ్

ఇది ప్రపంచములో అత్యధికంగా అమ్ముడయ్యే చర్మమును శుభ్రపరచే క్రీమ్

చీస్‌బ్రొ-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమిత బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 18—10—'68
కీలకనామ సం॥ ఆశ్వయుజ మాసం బహుళ ఏకాదశి
సంపుటము : 61 సంచిక : 8

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక



18—10—68

# ఉత్తరాలు

### సినిమా

నేను శ్రీ రామారావు గార్ని గురించి వ్రాసిన వ్యాసం శ్రీ సత్యంగారి పాఠకధర్మాన్ని నిలబెట్టడానికి సహాయ పడిందంటే నాకు సంతోషంగా వుంది. ఆయన లేఖను పఠించిన వారిలో నేనొకడ్ని కాబట్టి శ్రీ సత్యంగారిని అభినందించటం నా కనీస ధర్మం అనుకుంటున్నాను.

పత్రికా విలేఖరిగా నా బాధ్యతల్ని సవివరంగా (27—9—68 ఆంధ్ర సచిత్రవారపత్రిక) నాకు గుర్తు చేసిన శ్రీ సత్యంగారు యిప్పుడు నేను 'అక్షర కనవరచేందుకు కారకు'డివి కానన్నప్పటికీ నేను ఆయనకి కృతజ్ఞుడినిగా వుండకుండా వుండడం సబబుకాదనుకుంటాను.

శ్రీనివాస్ (మదరాస్)

### దసరా సంచిక

"దసరా సంచిక ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్వాంగసుందరంగా చక్కటి కథలతో, ఆణిముత్యాలాంటి సీరియల్ నవలలతో ఎంతో ఆకర్షణీయంగా వెలువడింది. ముఖ్యంగా పెళ్ళకూరు జయప్రదగారి "ఆకిరణ" కథ నా మనస్సును ఆకట్టుకొనింది.

గుత్తి లత (మదనపల్లి)

*　　*　　*

ఆంధ్రపత్రిక దసరాసంచికలో(4—10—68) 'శివకుమారి' గారు వ్రాసిన రచన "రచయిత్రులంటే చదువరులకి ఎక్కువ అభిమానం ఎందుకు" చదివిన తరువాత ఈ రచయిత్రికి (?)— రచయిత అయిన భర్త రచనలు కూడా తను స్వంత రచనలుగా చెలామణి చేస్తూ, తనూ వ్రాస్తూ అగ్రశ్రేణి రచయిత్రుల జాబితాలో పడిన రచయిత్రి గార్ని తెలియదేమో?— అనిపిస్తుంది.

అయినా తన రచన మాత్రం చాలా దూకుడుగా నడిపారు. అంతే చాలులెండి.

(అరుణ్‌కుమార్)

### కథలు

ఈవారం పత్రిక (27—9—68)లోని పెళ్ళకూరి జయప్రదగారి పెద్దకథ చాల బాగుంది. కాని చివర "ముగింపు పై వారం" అని పాఠకులనునిరాశ చేశారు. రచయిత్రి కథ మొన్ననే (27—7—68 పత్రికలో) 'పరమపదసోపానము చదివాం. అంతకు ముందు 'పిన్ని', 'నీకీజన్మలో పెళ్ళికాదు' అనే కథలు చదావాం. పాత రచనలు వాస్తవికతకు దూరంగా ఉన్నా, ఎంతోబాగున్నాయి. క్రొత్త నాగరికత, పోకడలతో రచనలు వ్రాసి పాఠకులకు తోడడుతున్న రచయిత్రికి, ప్రచురిస్తున్న పత్రిక సంపాదకులకు హృదయపూర్వక కృతజ్ఞతలు.

టి. యస్. యన్. మూర్తి, (తిరుపతి)

*　　*　　*

"నన్ను చెప్పనీయ్" అన్న కథ మీద శ్రీమతి గుత్తి లత (మదనపల్లి) గారు వ్రాసిన లేఖ చదివి చాలా ఆశ్చర్యపోయాను. నేను మా అక్కయ్యను 'అది' అనే అంటాను. అలా అక్కయ్యలను అనే తమ్ముళ్ళు నాకు తొంభై తొమ్మిది మంది తెలుసు. కొద్ది వయస్సు తేడాలో ఉన్న అక్కయ్యలను తమ్ముళ్ళు అలా పిలవటం వారి ఆత్మీయతకు నిదర్శనం!

పి. యస్. నారాయణగారూ—"చల్లని ఎండ", 'మనస్సు'లను మరిపించే సీరియస్ కథ ఒకటి మాకు అందించరూ—ప్లీజ్!

పి. శివానంద్ (వనపర్తి)

*　　*　　*

మిక్కిలి ఆకర్షణీయమయిన విజయనిర్మల ముఖచిత్రముగా గల 27—9—68 సంచిక పత్రికలో మీరు ప్రచురించిన ప్రశాంత్ గారి "నన్ను క్షమించరూ" రచన చదివాము. అందులో లలితగారి రెండో అన్నయ్య 'రమేష్ మిలటరీలో చేరి ప్రస్తుతము ఫ్రంట్‌లో వుంటున్నాడని వ్రాశారు! ఫ్రంట్‌లో వుంటున్న వాళ్ళు లలితగారి అన్నయ్య వివరించినట్లు అక్కడి సంగతులు చట్టరీత్యా వివరించరాదు, మరి లలితగారి అన్నయ్య రమేష్ ఆ విషయాలతో పాటు యింకా ఎన్నో ఎలా వ్రాయగలిగాడో మరి?

చిల్లాశేషు
చిల్లా సాంబశివరావు.
(4 స్క్వాడరన్ ఎయిర్ ఫోర్స్)

*　　*　　*

4—10—68 తేదీ గల వారపత్రికలో "పిన్ని" కథలో పిల్లలు పోవటానికి ఎబార్షన్లకు బాధపడి చివరకు ఆపరేషన్‌కు వప్పుకున్న పిన్నిని అట్లా చంపారేమిటి. పోని మాష్టరుగారు వేసెక్టమి చేయించుకోలేక పోయారా? బ్లడ్‌ప్రషర్ ఉంటే వేసెక్టమి చేయించుకోకూడదని ఎవరూ అనలేదే! సవితి కూతురు దూషించి వెళ్ళిపోవటమూ, కోడలు రాకపోవటము, పిన్ని ఆలోచనలు సహజంగానే ఉన్నాయి. గాని యీ చివరి మనుమడు ఎవరో చెప్పలేదు. కథకులు

దేవులపల్లి తాండవశివశాస్త్రి (శింగరాయపాలెం)

### గమనిక

గతవారం (11—10—68) సంచికలోని 55 పేజీలోఉన్న చిత్రసమీక్షలో 'నడమంత్రపు సిరి' చిత్రానికి సంగీతదర్శకుడు శ్రీ తాతినేని చలపతిరావు అని, 58వ పేజీలోని సినిమాడైరీలో బ్రహ్మానందచిత్రపురి అభివృద్ధి కమిటీ వారి పూర్వాహారవిందు సెప్టెంబరు 23వ తేదీన జరిగినదని, 61వ పేజీలో కింద ఉన్న బొమ్మ 'బంగారుసంకెళ్ళు' చిత్రంలోనిదని పాఠకులు గమనించకోరుతున్నాము. పొరపాటుకి చింతిస్తున్నాము.

స్థలాభావంచేత ఈ వారం బృహత్‌కథామంజరి కథలు ప్రచురించలేక పోతున్నాము. —సం॥


మధ్యప్రదేశ్‌లో యస్.వి.డి. వ్యవహారం
జి.యస్.సింగ్
రాజ్‌మాతా
అబ్దుల్లా, నువ్వు వేసే అడుగు గమనించు!
కాశ్మీర్ ప్రజల ఒడంబడిక
చట్టం సమ్మతించినమేర
మరో ఛాలెంజి!
ప్రభుత్వోద్యోగుల సమ్మె
దుష్ట యంత్రాంగం
ధరలు
జీతాలు
OOMMEN

శ్రీకృష్ణ

# కేంద్ర ప్రభుత్వోద్యోగుల సమ్మె

ఇంతకిముందే జరిగిన కేంద్ర ప్రభుత్వోద్యోగుల సమ్మెగురించి శల్య పరీక్ష జరుగుతోంది. జాయింట్ యాక్షన్ కమిటీ సభ్యులయిన సమ్మెనాయకులు 'జీవిత బత్తెం' గురించి గాని, అవసరాలని గుర్తించే వేతనంగురించి గాని మాట్లాడటం లేదు. ఇప్పుడు వారి ఆదుర్దా అంతా తమని తాము ఎలా రక్షించుకొనటమా, అని. వారివల్ల బాధలకి లోనయిన ఉద్యోగుల సంగతి వారికి అవసరం లేదా అన్నట్లు ప్రవర్తిస్తున్నారు: కాని, ఉద్యోగాలు పోయినవారికి మళ్లీ పనులు వస్తేనే వారి పరువు దక్కుతుంది.

**కమ్యూనిస్టుల పాత్ర**

ఈ సమ్మె నిర్వహణకి అధికంగా తోడ్పడినవారు కమ్యూనిస్టులు. ఇప్పుడు వారు చల్లగా జారుకుంటున్నారు. వారి సహచరులయిన (రెండు రకాల) సోషలిస్టు నాయకులకి అంతా వప్పగించేశారు. అయితే, పశ్చిమ బెంగాలులో కమ్యూనిస్టులే సారథ్యం వహిస్తున్నారు. అక్కడ ప్రభుత్వానికి విశ్వాసంగా ఉంటున్న ఉద్యోగులని దడిపించటం జరుగుతోంది. సస్పెన్షన్ ఆర్డరు జారీచెయ్యనున్న ఒక వ్యక్తిని, 'నిన్నేకాక నీ భార్యాబిడ్డలని కూడా హతమారుస్తా'మని బెదిరిస్తున్నారుట.

**కార్మిక విప్లవమా?**

ఇదంతా శ్రీ డాంగే మార్కు ప్రజాస్వామ్యం. సమ్మె వర్గయుద్ధంలో ఒక ముఖ్యమయిన ఘట్టం అన్నారు ఆయన. ఇది వర్గయుద్ధమా? మూడవతరగతి గుమాస్తా కార్మికవర్గానికి చెందిన వ్యక్తి అనవచ్చునా? అసలు శ్రీ డాంగే కార్మిక వర్గానికి చెందినవారా? ఒక్క పశ్చిమ బెంగాలుని మినహాయిస్తే భారతదేశంలో వర్గయుద్ధం అసలు లేనేలేదు. మూడవ తరగతి గుమాస్తాలు చాలామంది మధ్య తరగతి కుటుంబాలకి చెందినవారు. ఎందరో బాబూ బహదూర్ల అన్నదమ్ముళ్లకి వ్యాపారాలు ఉంటూ ఉంటాయి.

తపాలాశాఖలో పని మామూలు పరిస్థితులకి రాలేదు. హోంగార్డుల సాయంతో కొత్త టపాని కొంత పంచారు, ఢిల్లీలో. పాత ఉత్తరాల సంచులు అలాగే పడి ఉన్నాయి.

**బయటివారు**

బయటివారే యూనియన్లలోనూ, కేంద్ర ప్రభుత్వోద్యోగుల తరఫీదులోనూ ముఖ్య పాత్రలని వహిస్తున్నారన్నా అతిశయోక్తి కానేరదు. ఈ సందర్భంలో జాతీయ పారిశ్రామిక సంఘం యొక్క పరిశీలక వర్గం పారిశ్రామిక సంబంధాలని గురించి అన్న మాటలని ఉదహరిస్తాను:

ఈ దేశంలో అభివృద్ధి చెందుతున్న ట్రేడ్ యూనియన్లలో 'బయటి' వారు ముఖ్యపాత్రలని వహిస్తూ వచ్చారనీ, వారి సాయం యూనియన్లకి ఇంకా అవసరమనీ ఈ పరిశీలన సంఘం అభిప్రాయం. అయితే, ట్రేడ్‌యూనియన్ కార్యక్రమాలని తమ పూర్తి వృత్తిగా స్వీకరించే పనివారిని తయారుచేసే ప్రయత్నాలు జరగాలి. కొందరు వ్యక్తులు యూనియన్ల వ్యవహారాలపట్ల తగినంత శ్రద్ధ చూపించలేక పోతున్నారు. ఇటువంటివారిని ప్రోత్సహించటం మంచిదికాదని ఈ పరిశీలక సంఘం భావిస్తోంది. వారు భూస్వాముల వంటివారు. తమ పేర్లకి తగిన ప్రచారం జరుగుతుందికదా, అని మాత్రం వీరు యూనియన్లలో చేరుతూ ఉంటారు. వారికి 'తమ' యూనియన్ల పరిశ్రమలని గురించి అంతగా తెలియదు. యజమానులతో ఉమ్మడిగా బేరంచెయ్యడం వారికి బాగాతెలియదు. తరచు మొలుచుకువచ్చే యూనియన్ సమస్యలని ఏవిధంగా పరిష్కరించాలో వారికి తెలియదు. ఒకేసారి ఎన్నో యూనియన్లతో సంబంధం పెట్టుకుంటారు కాబట్టి సమయోచితంగా ఏ చర్య తీసుకోవాలో ఆ చర్య తీసుకోలేకపోతూ ఉంటారు. ప్రతి యూనియన్ అధివారి కొన్ని యూనియన్లకి మించి సంబంధం పెట్టుకోరాదనే చట్టం ఉండాలని ఈ పరిశీలక సంఘం భావిస్తోంది'

**చదువుకున్నవారు**

ఇది యదార్థ దృష్టితోకూడిన విధానం కాదనిపిస్తోంది. కేంద్ర ప్రభుత్వంలో ఎందరో చదువుకున్నవారు ఉన్నారు.

చదువు తక్కువ అయినవారికీ, సామాజికమయిన అయికమత్యంలేని పారిశ్రామికులకీ బయటివారి జోక్యం అవసరం కావచ్చు, ప్రభుత్వోద్యోగులలో చదువురానివారు లేరు. శ్రీ గోయెల్ సహాయం తపాలాశాఖ ఉద్యోగులకే అనవసరం, శ్రీ ఎస్. ఎమ్. బెనర్జీ సహాయం రక్షణశాఖ ఉద్యోగులకీ అనవసరం.

ఇంకొక సంగతి గమనించాలి. 1921 నాటికే భారతదేశం స్వతంత్రం కావాలన్నది. తన వ్యవహారాలని తనే నిర్వహించుకొన గలనన్నది. ఏభయి ఏళ్ల యూనియన్ల చరిత్ర తర్వాత మనదేశంలో బయటివారి జోక్యం లేకుండా యూనియన్ కార్యక్రమాలు సాగటం లేదంటే విధివైచిత్ర్యమే అనాలి. భారత పారిశ్రామిక వర్గం వారు కూడా స్వాతంత్ర్యంకోసం పోరాడటం అవసరం.

**భారతదేశంలో యూనియన్ల అభివృద్ధి**

ఇంకా వెనక్కి తరిచిసూస్తే ఒక వింత విశేషం గుర్తుకి వస్తుంది: భారతదేశానికి ట్రేడ్‌యూనియన్ (లేకకార్మికుల)ఉద్యమం తీసుకువచ్చింది బ్రిటిషువారు. అప్పుడు ఇది లంకాషయిర్‌కి సాయం చెయ్యటానికి దిగుమతిచేసిన ఉద్యమం అన్నారు. 'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసయిటీ' సభ్యులలో ఒకరయిన శ్రీ జోషి అప్పటి కాలంలో అఖిలభారత స్థాయి కల కార్మిక

నాయకుడు. అయినా, తర్వాత డా. అంబేడ్కర్, భారత కార్మికవర్గంకోసం ఎంతో కృషి చేశారు. వారి కృషి అవర్ణనీయం. మొన్నటిదాకా ఇండియన్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు రాజకీయ పక్షాలలో దేని అజమాయిషీకింద ఉండేది కాదు. దీని ప్రతినిధిగా శ్రీ జోషీ ఉండేవారు.

### కాంగ్రెసు తప్పటడుగు

క్రమంగా కమ్యూనిస్టులు ట్రే.యూ.కాం. లో అధికారం సంపాదించు కున్నారు. కాంగ్రెసుపార్టీ ఈ ధోరణిని ఆపటానికి సరయిన చర్యలు తీసుకునే బదులు తను స్వంత యూనియన్ ఒకదానిని సృష్టించారు. ఇదే ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, (ఐ. ఎన్. టి. యు. సి.)

ఇదంతా సుపరిచితమయిన పద్ధతిలో జరిగింది. ముందు కమ్యూనిస్టులు, సోషలిస్టులు, హిందూమహా సభవారు— వీరందరూ ఇండియన్ నేషనల్ కాంగ్రెసు (రాజకీయ పక్షం) సభ్యులుగా ఉండేవారు. మహాత్మా గాంధీగారి ఆగమనంతో వీరందరూ ఈ పార్టీని వదిలి వెళ్ళిపోయారు; ఎందుకంటే, ఆ పార్టీని కైవశం చేసుకోలేక పోయారు. ఇక పారిశ్రామిక ఉద్యమం విషయంలో కాంగ్రెసు పార్టీయే ఇండియన్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌ని కైవశం చేసుకోలేక తన స్వంత యూనియన్‌ని నెలకొల్పింది. దీని నాయకుడుగా లాలాగుల్జారీలాల్ నందా నియమితులయ్యారు. ఇక సోషలిస్టులు హింద్ మజ్దూర్ సభని పెట్టారు.

### యూనియను

మొత్తం నాలుగు కేంద్ర యూనియన్ సంస్థలు ఉన్నాయి. ఇవి— ఐ. ఎన్. టి. యు. సి, ఎ. ఐ. టి. యు. సి., యు. టి. యు. సి., హింద్ మజ్దూర్‌సభ. వీటికి చెందిన ఉప — యూనియన్లు తూర్పు ప్రాంతంలో వివిధ రాష్ట్రాలలో ఉన్నాయి. ఇవిగాక పరిశ్రమ రకాల ప్రకారం, ఒక్కొక్క పారిశ్రామిక సంస్థకీ ఒక్కొక్క యూనియన్ చొప్పునా వయిన చెప్పిన యూనియన్లకి చెందినవి చాలా ఉన్నాయి. ఇటీవల భారతీయ మజ్దూర్ సంఘం, ఐ. ఎఫ్. ఐ. టి. యు.—ఈ రెండు యూనియన్లూ పుట్టాయి. కాని, ఇవి చెప్పుకోదగ్గవిగా లేవు. ఎన్నో పరిశ్రమలలో పరిశ్రమల దినుసులని పట్టి యూనియన్లు కాక కార్ఖానాల పద్ధతి మీద ఏర్పడిన యూనియన్లు కూడా ఉన్నాయి.

ప్రభుత్వరంగం ఉక్కు మిల్లులలో ప్రతి కేంద్ర యూనియన్‌కి సంబంధించిన ఉప— యూనియన్‌లు ఉన్నాయి. రూర్కెలా ఉక్కు కర్మాగారంలో అయిదు యూనియన్లు ఉన్నాయి. అధికారయుతంగా గుర్తింపబడిన యూనియన్ హిందుస్తాన్ స్టీల్‌వర్కర్స్ ఎసోసియేషన్. ఇది ఐ. ఎన్. టి. యు. సి. కి చెందినది. ఇదికాక రూర్కెలా మజ్దూర్ సభ, (హింద్ మజ్దూర్ సభ), రూర్కెలా వర్కర్స్ యూనియన్ (యు. టి. యు. సి.), రూర్కెలా స్టీల్ మజ్దూర్ యూనియన్ (ఎ. ఐ. టి. యు. సి.), నార్త్ ఒరిస్సా వర్కర్స్ యూనియన్ (స్వతంత్రమయినది). దుర్గాపూర్‌లోనూ రిజిస్టర్ అయిన యూనియన్లు అయిదు ఉన్నాయి. ఇక్కడా ఐ. ఎన్. టి. యు. సి. యూనియన్ ఒకటే అధికారులచేత గుర్తింపబడినది. ఇక్కడ ఉన్న హిందుస్తాన్ స్టీల్ ఎంప్లాయీస్ యూనియన్ ఎ. ఐ. టి. యు. సి. ది; దుర్గాపూర్ హిందూస్తాన్ స్టీల్ వర్కర్స్ ఎసోసియేషన్ ఫార్వర్డ్ బ్లాక్‌ది; దుర్గాపూర్ స్టీల్ ఎంప్లాయీస్ యూనియన్ హింద్ మజ్దూర్ సభది; దుర్గాపూర్ స్టీల్ ప్లాంట్ ఎండ్ కంట్రాక్టర్స్ మజ్దూర్ యూనియన్ యు. టి. యు. సి. ది.

### పరస్పర ద్వేషాలు

ఈ యూనియన్లన్నీ కలిసి పరిశ్రమ మొత్తంమీద మంతనాలు జరపటం అంటూ లేదు. ఏ కార్ఖానా యాజమాన్యం అక్కడి యూనియన్లతో మాట్లాడుకుని ఏర్పాట్లు చేసుకుంటారు. యూనియన్ల మధ్య అసూయలకి అంతు లేదు. వీటిఫలితంగా పరిశ్రమదెబ్బతింటోంది.

1926 లో నెలకొల్పిన ఇండియన్ ట్రేడ్ యూనియన్స్ చట్టం యూనియన్ ఉద్యమాన్ని బలపరచటానికి సృష్టించవబడింది. చట్టం ద్వారా వారికి రక్షణ ఇవ్వాలని ప్రభుత్వంవారు అనుకున్నారు. ఏ కర్మాగారంలోనయినా ఏడుగురు పనివారు ఉంటే యూనియన్ స్థాపించవచ్చునని ఈ చట్టం అంటుంది. ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా ఈ చట్టాన్ని సవరించాలా అని ఆలోచించాలి. సంఖ్యని పెంచాలా లేదా అని చూడాలి.

గడచిన 42 సంవత్సరాలలో ఎన్నో కర్మాగారాలలో ఎన్నో యూనియన్లు జన్మించాయి. వీటి మధ్య ద్వేషాలు యూనియన్ల బలాన్ని తగ్గిస్తూ వచ్చాయి. ఏ యూనియన్ అధికారయుతంగా గుర్తింపబడిందో దానికే బేరం చేసే హక్కు ఇవ్వాలనే నిర్ణయంతో ఈ బలహీనతని తగ్గించటానికి చూశారు ప్రభుత్వం వారు.

### బ్రిటన్ - భారత్

బ్రిటన్‌లో యూనియన్లు శాసనసభల కోసం వర్గాలు తయారు చేసుకున్నాయి. ఇదే లేబర్‌పార్టీగా రూపొంది దేశాన్ని పరిపాలించటం మనం చూస్తున్నాము. భారత దేశంలో రాజకీయ పక్షాలు యూనియన్లని సృష్టించి తమ ప్రచారాలని పెంపొందించటానికి ప్రయత్నిస్తున్నారు. ఢిల్లీలో శ్రీ సొంధీ కేంద్ర ఉద్యోగులని అతిగా బలపరుస్తున్నారంటే వారి వోట్లు ఆయనని లోకసభకి పంపించాయి కాబట్టే.

అంతరంగిక వ్యవహారాల మంత్రి శ్రీ చవాన్ నిస్సహాయ స్థితిలో ఉన్నారు. బయటివారికి ఎదురుగా తాము ఏదయినా నిర్ణయం తీసుకుంటే తమ కాంగ్రెసు సహోద్యోగుని కార్మికోద్యమంనుంచి పంపించి వేసినట్లే అవుతుంది.

### డిసెంబర్ మాట?

ఇదంతా అప్రస్తుతం. డిసెంబరు 22, 1968 నాడు కేంద్రప్రభుత్వోద్యోగులు చెయ్యనున్న సమ్మె గురించి ప్రభుత్వం ఏమి చెయ్యాలన్నది ప్రధాన కర్తవ్యం. ఎదురు తిరిగినవారిని కథానాయకులుగా చేస్తే విశ్వాసంగా పనిచేసిన వారిగతి ఏమిటి? సైన్యంలో ఎదురుతిరిగినవారిని కోర్ట్ మార్షల్ చేస్తారు. పనిపోయిన వారందరినీ మళ్లీ తీసుకుంటే తిరుగుబాటుకి బహుమానం లభించినట్లేకదా?

భారతదేశంలో అరాజకం రాకుండా తప్పినదన్నారు అంతరంగిక వ్యవహారాల శాఖమంత్రి. ఇది నిజమే. శ్రీమతి గాంధీ దేశంలో లేకపోవటం దీనికి ఎంతో సహకరించింది. ●

కె. రామలక్ష్మి

# కొంచెం ఆగండి!

ఆడవాళ్లతో వచ్చిన చిక్కే ఇది — ఎక్కడ ఆగాలో తెలియదు వాళ్లకి! అలసిపోయిన కొద్దీ మరీ హడావిడి పడిపోతరు— పని ముగించాలని. ఫలితం ఏమిటి? పని జరక్కపోవడమే కాదు, విసుగు కోపం ఎక్కువ అయిపోవడం—దాంతో ఏముందీ? 'ఈ పలుగు కాస్సేపు పడుకుని అఘోరించకూడదూ?' అని ఇంటిల్లిపాదికీ అనిపిస్తుంది. ఓ గంట విశ్రాంతి తీసుకుంటే ద్విగుణీకృతమైన ఉత్సాహంతో పని చేత పట్టచ్చుగా? ఏదైనా పండగా పబ్బం వచ్చిందంటే భయంగా ఉంటుందండీ' అంటూ ఓ పధ్నాలుగేళ్ల అమ్మాయి పక్కింటి పిన్నిగారికి చెప్తోంది. 'ఏమే! హాయిగా అన్నీ అమర్చి పెట్టొంటేనూ?' అంటూ సాగతీసారామె. 'ఏమీ లేకపోయినా సరదాగానే ఉండును — ఈ విసుగులూ, తిట్లూ దీవెనలూ కంటె' అంటూంది అమ్మాయి. నిజమే మరి—సరదాగా కబుర్లాడుతూ ఏ చారులన్నమో తిన్నా హాయిగానే ఉంటుంది. ఘుమారుమంటూ అన్నిపిండి వంటలూ చేసుకుని బాధపడ్డంకంటె.

అసలలా అలసిపోయి, అది తెలుసకోక యింకా శరీరాన్నీ మనస్సునీ అలసటపాలు చేసే తత్వం ఆడవాళ్లలో ఉంది నిజమే—ఆదే తత్వం మనలో లేకుంటేనూ చిక్కే—చాలా పనులు కీచుమంటూ స్విచ్ తీసేసినట్టు ఆగిపోయినా పోతయి. శరీరం అలసిపోయినా మానసికమైన దేదో మొండి శక్తి ఆడవారిని గుడ్డిగా ముందుకు నడిపించకపోతే చాలాపనులు అసలు కొనసాగవు అనడం అతిశయోక్తి కాదు.

పెళ్లి అయిన టీచర్లకి—తమ పిల్లలూ భర్తలూ ఉంటారు—ఊరిపిల్లలని ఇంటికి పంపించేశాక. నర్సులు, డాక్టర్లు ఒకరేమిటి ఏ రకమైన వృత్తి చేపట్టినా ఆడవారికి వృత్తికి నెత్తిన ఇల్లూ వాకిలి అనే బాదరబందీ ఉండి తీరుతుంది. ఏ స్త్రీ అయినా ఉద్యోగిని అంటే— ఇటు ఉద్యోగం అటు ఇల్లూ—రెండు ఉద్యోగాలు చేస్తోందన్నమాటే— ఆమె సహనశక్తులకి నిత్యం పరీక్ష పెడుతూనే ఉంటాయి—ఈ రెండూ. అందుకే ఉద్యోగి అయిన పురుషుడికి ఎనిమిదిగంటలే డ్యూటీ అయితే స్త్రీకి ఇరవైనాలుగ్గంటలు అని చెప్పుకోవచ్చు. డాక్టర్లని దర్శించే రోగులలో అలసిపోయి నిస్త్రాణకి మందులంటూ తిరిగే వారిలో నూటికి ఎనభైమంది ఆడవాళ్లే. మగవాళ్లకంటే ఆడవారు త్వరగా అలసిపోతారు—అది వారి తత్వంలోనే ఉన్న జబ్బు.

కార్మికుడైనా, మేధతో పనిచేసే వాడైనా మగవాడు—ఆ రోజుకి పని ముగియగానే—హాయిగా ఊపిరి పీల్చుకుని బయిట పడతాడు. కాని ఆడది అలా కాదు. కాఫీ టైములో హాయిగా ఉండడం నేరంగా భావించి శరీరం 'హోల్టు'! అన్నాసరే మొండిగా పని కొనసాగిస్తుంది. మగవాడు అలసట తోచినప్పుడు ఆగుతాడు. ఏ పేపరో, ఏ సిగరెట్టో పట్టుకుని విశ్రాంతి తీసుకుంటాడు. ఆడది అలసిపోతే, చేతిలో పని పూర్తి కాకపోతే, చేద్దామనుకున్నవన్నీ అనుకున్నట్టు అవకపోతే — పళ్లు గిట్టకరుచుకుని కొనసాగిస్తూనే ఉంటుంది— అలసినమీదట మొండిగా పూర్తి చేసిన పని అంతంత మాత్రంగానే ఉంటుందని గ్రహించదు!

ఆడదానికి కొంచెం—ప్రకృతి ఇస్తున్న సిగ్నల్స్ గ్రహించే నేర్పు ఉంటే ఎంతైనా బాగుంటుంది. నెప్పిలాగే అలసట కూడా ఒక గుర్తే. అలసట సూచిస్తున్న డేంజర్‌ని లెక్కచేయని ఆడది అనవసరంగా 'ముసళ్ల పండుగ' కొనితెచ్చుకుంటోందన్న మాటే. అలాంటివారిని ఇంట్లోవాళ్లు కనిపెట్టి 'కొంచెం ఆగు. కొంప మునిగిపోదులే' అని బలవంతాన విశ్రాంతికి దోవ కల్పించాలి. ఆమె మూర్ఖత్వం నుండి ఆమెనే రక్షించాలి. కాని ఎవరు చెప్పకలరు? అదీ నిజమే. అలసట ఎక్కువ అయినకొద్దీ మొండి పట్టుదలా పెరిగిపోతుంది! ఎందుకోసం? అంత మొండిగా తెగించి పొందే ఫలితం ఏమిటి? ఒళ్లు హూనం చేసుకుని ఆడవాళ్లు చేయాలని సతమతం అయిపోయే పనులలో నిజంగా సగానికి సగం మర్నాటికి అట్టే పెట వచ్చు! అసలు చేయకపోయినా ఇబ్బందిలేదు కూడా! 'నా జీవం మీకు ధారపోశాను' అంటూ నేరారోపణ చేయడంలో అర్థం ఉండదు —






మనం ఈ భూమిమీద అవతరించక ముందు కొన్నికోట్ల సంవత్సరాలకింద నివసించిన జంతువు ఇది. సుమారుగా 10, 15 కోట్ల సంవత్సరాలకిందట మాట. అత్యంతం భయంకరమైన ఈ సరీసృపం డైనోసార్ల వర్గానికి చెందింది. ఇప్పటి బల్లులు మొసళ్లు దీనిదగ్గర బంధువులు. అయినా ఇవి దాని కాలి గోళ్లకుకూడా సాటికిరావు.

టిరానోసారస్ వెనకకాళ్లు రెండిటి మీద మాత్రమే నడిచిన ద్విపాది. ముందుజత కాళ్లు ఎందుకూ పనికి రానంత చిన్నవిగా క్షీణించిపోయాయి. నోటివరకూ కూడా అందనట్టివి. వెనకకాళ్లు మాత్రం విపరీతమైన పరిమాణంలో ఎదిగి వాడిగోళ్లతో భయంకరమైన ఆయుధాలుగా కూడా ఉపయోగించాయి.

ఈ జంతువు అవశేషాలను (శిలాజాలు) బట్టి దాని రూపురేఖా లక్షణాలను తెలుసుకోగల్గాము. సుమారుగా 47 అడుగుల పొడవున్న ఈ డైనోసార్ 20 అడుగుల ఎత్తు ఉంది. ఆ రోజుల్లో పెద్ద పెద్ద శాఖాహారులు—అవీ డైనోసార్లే—ఉండేవి. వాటి మీదనే ఇది విస్పందేహంగా ఆధారపడి ఉండేది.

తల సుమారు 4 అడుగుల పొడవు. దవడలకు భయంకరమైన దంతాలు ఉండేవి. ఇవి సుమారు 6 అంగుళాల పొడవు ఉండడమే కాకుండా, రంపాల వలె, ఇటు అటూ కూడా మొనలుతేరి ఉండేది. ఎంతమొద్దు 'చర్మం'లోనయినా సునాయాసంగా దిగిపోగల్గ ఉండేది.

దీనికి ఎదురుతిరిగే జంతువులేనందు వల్ల ఆరోజుల్లో ఉండేదీనిని విస్పందేహంగా 'మృగరాజు' అని చెప్పుకోవచ్చు!

—ఇమ్మి కోనేటిరావు

## వనితాలోకం

అలా ఎవరు చేయమన్నారు? ఆమె అలసిపోయి నలిగిపోయి కళ్లలో ప్రాణాలతో ఉండాలని ఎవరూ ముఖ్యంగా ఇంట్లో వాళ్లు కోరుకున్నారా? వాళ్లకి కావలసినది ఆమెగాని ఆమె మూర్ఖంగా ముగించే పనులా?—నవ్వుతూ, తుళ్లుతూ సరదాగా తిరిగే ఆడది ఇంటికి వెల్గుగాని ముక్కు మూల్గి ముఖం చిట్లించుకుని ఇంట్లో కాలు ఆన్చకుండా నడిచే మనిషి కాదు. బోలెడు పనిచేసి ఇంటిని పక్కింటావిడలా కాకుండా అద్దంలాఉంచి అలసి రాక్షసిలా తయారయ్యే ఆడదానికంటే భర్తా పిల్లలతో సరదాలను పంచుకుంటూ సుఖంగా జీవించకల్గే ఆడది సాధించే విజయమే గొప్పది. అందుకే అలసిపోతే అందరిమీదా విరుచుకు పడకుండా—కొంచెం విశ్రాంతి తీసుకోండి. అదేం నేరంకాదు — ఏ ఇష్టమైన కుట్టో, బుక్కో, పత్రికో, కబుర్లో— ఏదైనా చాలు — ●

**వంటలు:**

### పొరటు

నాలుగుపెద్దసైజు పుల్లిపాయలు, ఒకపది పచ్చిమిరపకాయలు సన్నగా తరిగివుంచాలి. అల్లంకూడా సన్నగా తరగాలి. కుంపటిమీదకళాయిపెట్టి, కాస్త యెక్కువగా నూనెపోసి, తరిగిన ముక్కలువేసి, రెండు నిమిషాలు వేగనిచ్చి, నో మూడు గుడ్లు కొట్టి అందులోవేసి, సరిపడ వుప్పు, పసుపుకూడా వేసి, సన్నని సెగని అట్లకాడతో కలుపాలి. ఐదునిమిషాలు అయ్యాక, కాస్త యెక్కువగానే కొత్తమీర తీసుకొని, సన్నగాతరిగి పొరటులో వేసి, గరమ్‌మసాలా పొడికూడావేసి, నోరెండు నిమిషాలు ఆగి దించుకోవాలి. యీవంట అన్నిటికంటే త్వరగాను, సులువుగాను అవుతుంది. అప్పటికప్పుడెవరైనా అతిధులు వచ్చినప్పుడు తేలిగ్గా చేసెయ్యొచ్చు. (అస్తమానూ గరమ్ మసాలా నూరుకోవటంకంటే అర తులం చొప్పున లవంగాలు, యాలుక్కాయలు, దాసినచెక్క, పావుశేరు ధనియాలు, గుప్పెడు జీలకర్ర, టేబుల్‌స్పూన్ బియ్యం, వేటికవి విడివిడిగా వేయించి మెత్తగా పొడిదంచి సీసాలో వేసుకుని వుంచుకుంటే ప్రతిసారి నూరుకోనవసరం లేకుండా వాడుకోవచ్చు.)

కె. విజయలక్ష్మి
రాజమండ్రి.

●

# శ్రీశైలం ప్రాజక్టు



నిర్మాణంలో ఉన్న కాఫర్‌డామ్.

## శ్రీశైల క్షేత్రం

భారతదేశంలోని ప్రధాన పుణ్యక్షేత్రాలలో శ్రీశైలం ఒకటి. ఈ పేరుతో మూడు క్షేత్రాలు పూర్వకాలంలోనే ప్రసిద్ధికెక్కాయి. ఒకటి కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకాలో నల్లమల కొండల మీద వున్న శైవక్షేత్రం. రెండు చిత్తూరు జిల్లాలో తిరుమల పై వున్న విష్ణు క్షేత్రం. మూడు గుంటూరు జిల్లాలో కృష్ణాతీరాన వున్న బౌద్ధక్షేత్రం. ఈ మూడింటిలో యిప్పుడు శ్రీశైలమంటే శైవక్షేత్రమే అని రూఢమైపోయింది. శ్రీనివాసుని క్షేత్రం తిరుమలగానూ, బౌద్ధక్షేత్రం నాగార్జున కొండగానూ ప్రసిద్ధాలయి ఉన్నవి.

శ్రీశైలక్షేత్రం సముద్ర మట్టానికి 1500 అడుగుల యెత్తున దుర్గమమైన పర్వతాల నడుమ ఉన్నది. దేశం నాలుగు మూలలనుంచి అక్కడికి భక్తులు వస్తారు. చాలా క్షేత్రాలలో ఏదో ఒక్క దేవతకే ప్రాధాన్యం వుంటుంది. శ్రీశైలంలో మాత్రం మల్లికార్జునుడికీ, ఆయన అర్ధాంగి భ్రమరాంబాదేవికీ సమానంగానే ప్రాధాన్యం ఉన్నది. మల్లికార్జునుడు ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకడనీ, భ్రమరాంబ అష్టాదశ మహాశక్తులలో ప్రధానమైన భ్రామరీ శక్తి అనీ పెద్దలు చెప్తున్నారు.

శైవక్షేత్రాలన్నింట్లోనూ శ్రీశైలమే ఉత్కృష్టమైనదట! కాశీలో మరణిస్తే ముక్తి, అరుణాచలంలో దేవుణ్ణి స్మరిస్తే మోక్షం లభిస్తుంది. శ్రీశైలంలోని శిఖరమాత్రదర్శనం వల్లనే మోక్షప్రాప్తి కలుగుతుంది. దీనిని

"కాశ్యాం తు మరణాన్ముక్తిః
స్మరణా దరుణాచలే,
దర్శనాదేవి శ్రీశైలే
పునర్జన్మ న విద్యతే.
.....................
శ్రీశైల శిఖరే దృష్ట్వా
పునర్జన్మ న విద్యతే"

అనే శ్లోకాలు తెలుపుతున్నవి.

శ్రీశైల స్థలమాహాత్మ్యాన్ని గురించి రకరకాల గాథలు ఉన్నవి. కొన్ని శిలలమీద చెక్కబడినవి కూడ వున్నాయి. వాటిలో భ్రమరాంబా, మల్లికార్జునుల గురించిన గాథలను సంగ్రహంగా తెలుసుకుందాం.

ఆదికాలంలో శిలాదుడనే మహర్షి సంతానంకోసం తపస్సు చెయ్యగా నందీశ్వరుడు, పర్వతుడు అనే యిద్దరు పుత్రులు పుట్టారు. దైవభక్తి గల ఆ యిద్దరూ పరమేశ్వరుడిని గురించి ఘోరంగా తపస్సు చేసి భగవత్సాక్షాత్కారాన్ని పొందారు. వరాలుకోరుకో వలసిందని పరమశివుడు అడగ్గా, తానాతనికి వాహనంగా వుండాలని నందీశ్వరుడు కోరుకున్నాడు. నందీశ్వరుడు నందికొండగా మారగా, దేవుడక్కడ నివాసం ఏర్పరచుకున్నాడు. పర్వతుడు కూడా అదేవిధంగానే వరం కోరాడు. శివుడు పర్వతంగా మారిన పర్వతునిపై స్థిరనివాసం ఏర్పరచుకుని, అతనికోరిక ప్రకారం పర్వతలింగం అనే పేరుతో ప్రసిద్ధికెక్కాడు. ఆ పర్వతుడే శ్రీశైలం.

ఈ 'శైలక్షేత్రా'నికి ముందు "శ్రీ" అని చేరి శ్రీశైలం అయింది! దానికి కారణం లేకపోలేదు. కృతయుగంలో వసుమతి అనే మునికన్య శివుని గురించి తపస్సుచేసి తనకు "శ్రీ" అనే పేరుతో స్థిరపడేటట్లున్నూ తన పేరుతోనే యీ పర్వతక్షేత్రం ప్రసిద్ధమై వుండేటట్లున్నూ వరాలు పొందినది



శ్రీ కె. వి. శ్రీనివాసరావు
(ఛీఫ్ ఇంజనీరు)



శ్రీ ఎం. వెంకటరావు సూపరింటెండింగ్ ఇంజనీరు (డిజైన్స్ & ఇన్వెస్టిగేషన్ సర్కిల్)

శ్రీశైలలింగం "మల్లికార్జున" నామం పొందడానికిన్నీ ఒక గాథవున్నది. పూర్వం చంద్రగుప్త అనే పట్టణాన్ని పాలిస్తున్న చంద్రగుప్త మహారాజుకు ఒక కుమార్తె వుండేది. ఆమెపేరు చంద్రవతి. గొప్ప దైవభక్తి కలది. ఆమెకు యుక్తవయస్సు రాగా, ఎందరో రాజకుమారులు ఆమె పాణిగ్రహించడానికి ప్రయత్నించారు. ఆమె మానవమాత్రుణ్ని వివాహమాడనొల్లక, శ్రీశైలానికి వచ్చి తెల్లని మల్లెపువ్వులతో పరమేశ్వరుణ్ని పూజిస్తూ కాలం గడిపింది. ఈమెదీక్షకూ, భక్తికీ సంతోషించి పరమశివుడు వరం కోరుకొమ్మని అన్నాడు. అప్పుడామె, "ఓ మహాదేవా! పవిత్రమైన గంగానదిని ధరించినట్లుగా నీ శిరస్సుపైని నేను సమర్పించే తెల్లని మల్లికా దామాన్ని ధరించుము. ఇదినీకు సదా భూషణమై ప్రకాశించుగాక! నేను మానవుని వివాహం చేసుకోదలచ లేదు. నన్ను నీ అర్ధాంగిగా పరిగ్రహించాలని ప్రార్థన" అని కోరింది అప్పుడు ఆ దేవుడు "తెల్లని మల్లెపూలతో నన్ను పూజించినందున నాకు మల్లికార్జునుడనే పేరు కలిగింది నీవు భ్రమర కీట న్యాయంగా భక్తులను చూస్తూ వున్నందున నీకు భ్రమరాంబ అనేపేరు ప్రసిద్ధమై వుంటుంది" అని చెప్పి ఆమెను తన దేవిగా స్వీకరించాడు. అర్జున శబ్దానికి 'తెల్లని'అనే అర్థం వున్నందున మల్లికార్జునుడనే పేరు ఆదేవుడికి అనుగుణంగానే ఉన్నది.

శ్రీశైలం యుగయుగాల నుంచీ ప్రసిద్ధంగా వున్నదని అంటారు యుగాల సంగతికేమిగాని, ఇక్కడ లభించిన శిథిలాలను బట్టి యిది ఒకప్పుడొక నగరంగా నిశ్చయించబడింది. క్రీ. శ. 3వ శతాబ్దిలో— ఇక్ష్వాకులకాలంలో బౌద్ధులకూ, శైవులకూ జరిగిన కలహాల మూలంగా దీనికి క్షీణదశ వచ్చింది. చాళుక్యుల కాలంలో పునరుద్ధరింపబడి, కాకతీయుల కాలంలో గొప్ప అభివృద్ధిని పొందింది.

ఆది శంకరులు ఇక్కడ కొంతకాలం వుండినట్లు గ్రంథ ప్రమాణం ఉన్నది అన వేమారెడ్డి యిక్కడ ఒక మండపం కట్టించినట్లు శాసనంవుంది. 15—వ శతాబ్ది ప్రారంభంలో పెదకోమటి వేమారెడ్డి కాశీయాత్రకు వెళుతూ శ్రీశైలాన్ని దర్శించాడట! శ్రీకృష్ణదేవరాయలు కళింగ విజయాన్ని సాధించి యిక్కడికి వచ్చి స్వామి దర్శనంచేసుకున్నాడు. ఇక్కడ కొన్ని మండపాలు కట్టించి గుడికి కొన్ని గ్రామాలు దానం చేశాడు. ఛత్రపతి శివాజీ యిక్కడ ఉత్తర గోపురాన్ని నిర్మించాడు. 18—వ శతాబ్ది చివరలో కర్నల్ కాలిన్ మెకంజీ వ్రాతలను బట్టి యిది అప్పుడు చాలా దయనీయస్థితిలో ఉండినట్లు తెలుస్తున్నది. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్—కేంద్ర ప్రభుత్వాలు దీని అభివృద్ధికి ఎక్కువ శ్రద్ధ తీసుకోవడం ముదావహం.

ఆంధ్ర వాఙ్మయంలో శ్రీశైలప్రస్తావన చాలా ఎక్కువగానే కానవస్తున్నది ఆదికవి నన్నయభట్టు శ్రీశైలాన్నిగురించి ప్రస్తావించాడు. నన్నెచోడుడు తన కుమార సంభవాన్ని తన గురువునకు అంకితమిస్తూ, అతనికీ, మల్లికార్జున దేవుడికీ అభేదాన్ని కల్పించాడు. శివకవుల సంగతి చెప్పనక్కరయే లేదు. శ్రీనాథుడు శ్రీశైలంలో వుండే శివరాత్రి మహాత్మ్యాన్ని రచించాడు. వాగలబాటి శేషమాత్యుడు



నిర్మాణంలోఉన్న కాఫర్ డ్యామ్.

పర్వత పురాణమనే పేరితో దీనిమహాత్మ్యాన్ని ప్రబంధంగా రచించి శ్రీ మల్లికార్జున దేవునికే అంకితం యిచ్చాడు.

శ్రీశైలం తెలుగుదేశపు ఎల్లలలో ఒకటి. సనాతన పద్ధతికి చెందిన ప్రతిహైందవుడూ ఏ కార్యానికైనా సంకల్పం చెప్పుకునేటప్పుడు శ్రీశైలాన్ని స్మరించి, దానికి ఏ దిక్కునవున్న ప్రదేశంలోతానున్నదీ చెప్పుకుంటాడు. దీన్నిబట్టి భౌగోళికంగా దీని ప్రాముఖ్యం వెల్లడి అవుతున్నది.

ఇక్కడ భ్రమరాంబ మల్లికార్జునుల దేవాలయాలే కాకుండ చూడవలసినస్థలాలు— భీముని కొలను, పాతాళగంగ, పాలధారపంచధారలు ప్రధానమైనవి. ఈ ప్రాంతాన్ని సస్యశ్యామలంగా చెయ్యడానికి తయారవుతున్న శ్రీశైలం ప్రాజెక్టు తప్పక చూడదగిన దృశ్యం.

—ఋ వేం. ర.



శ్రీ కె. రాజారావు, సూపరింటెండింగ్ ఇంజనీరు (సివిల్ సర్కిల్)

# శ్రీశైలం ప్రాజక్టు

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికంగా తగినంత అభివృద్ధి సాధించలేక పోతున్నదంటే విద్యుచ్ఛక్తికొరత దానికొక ముఖ్య కారణం అన్నా అతిశయోక్తి లేదు. అయితే ఆంధ్రదేశంలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి కావలసిన సంపద చాలా ఉంది. నీటి పారుదల ద్వారా 20 లక్షల కిలోవాట్‌లు ఉత్పత్తిచేయవచ్చు. బొగ్గు నిధులు 400 కోట్ల టన్నులు ఉన్నాయట. వీటి వినియోగం క్రమంగా జరిగితే విద్యుచ్ఛక్తి ఉత్పత్తి బాగా పెరుగుతుంది ఈ పెరుగుదలకి అవసరమయిన ముఖ్య పథకాలలో శ్రీశైలం ప్రాజెక్టు ఒకటి.

ప్రాజెక్టు కోసం రు 45 75 కోట్లు శాంక్షను చేశారు, ఈమొత్తంతో సబ్‌స్టేషను, ట్రాన్స్మిషన్ లైన్లుకూడా నిర్మించాలి.

ఇక ప్రాజెక్టు కి సంబంధించిన కొన్ని వివరాలు:

1. కర్నూలు జిల్లాలో ఉన్న శ్రీశైల దేవాలయం వద్ద కృష్ణానది మీద ఒక ఎత్తయిన ఆనకట్ట. ఆనకట్ట పొడుగు 1680 అడుగులు. పునాదులనుంచి పయి అంచుదాకా 420 అడుగులు, దీనివెనుక నిలిచే నీరు 308 టి ఎమ్. సి. అంటే 70.6 లక్షల ఎకరాల అడుగులు.

2. కుడివయిపున మొత్తం 770 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి కావలసిన ఏడు యూనిట్ల పవర్ హౌస్ (వీటిలో ముందు నాలుగు యూనిట్లు నిర్మిస్తారు.)

3. నాగార్జున సాగర్, కడప సబ్‌స్టేషన్ల శక్తిని హెచ్చించే ట్రాన్స్‌ఫార్మర్ యార్డు. (11 కేవ

(64 వ పేజీ చూడండి)



శ్రీ ఎ. జి మాధవన్ సూపరింటెండింగ్ ఇంజనీరు (మెకానికల్ సర్కిల్)

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## సజీవ సమాధి

దక్షిణ ఆర్కాటుకు చెందిన కవరై అనేవూళ్లో 29 ఏళ్ళ ముత్తుస్వామి తనభార్య సుందరం అనే ఆమెను సజీవసమాధి చేశాడట. సుందరం తన పాత ప్రియుడు కలివరదన్ అనే అతనితో పెళ్ళి అయ్యాక కూడా బాహాటంగా, నిర్భయంగా తిరుగుతోందట. ఈ విషయాన్ని వూరిపెద్దలు కూడా గ్రహించి వారించినా ఆమె వినలేదట. దాంతో వళ్ళు మండిన ముత్తుస్వామి ఆమెను లాగి లెంపకాయకొట్టే సరికి ఆమె మైకంతో పడిపోయిందట. తను పెరట్లో త్రవ్వి సిద్ధం చేసుకున్న గోతిలో ఆమెను పడుకోబెట్టి, మన్ను కప్పేశాడట.

*　　　*　　　*

భూపాలన్ అనే 25 ఏళ్ళ వ్యక్తికి యశోదఅనే ఆమెకూ అక్రమ సంబంధం వుందట. ఈ సంగతి గ్రహించి, భూపాలన్ భార్య చిన్నతాయి భర్తను వారించి, వినకపోతే పోట్లాడి, పుట్టింటికి వెళ్ళిపోయిందట. కన్నవారు ఆమెను వారించి, మళ్ళీ భర్తయింటికి పంపారట. మళ్ళీ రంధి మొదలయ్యిందట. మర్నాడు తను పొలానికి వెళుతూ తనకి అన్నం పొలానికి తీసుకురమ్మని చెప్పాడట. అన్నంతెచ్చిన భార్యపీక నులిపి, చంపి చెరుకుతోటలో పారేశాడట. ఇది గుడియాత్తం తాలూకా ఎరుక్కింపాడులో జరిగింది.

## వెరీ 'బాడ్'



## చిత్రహింస

మానవత్వాన్ని మంట కలిపి, పశుత్వాన్ని అంట కట్టుకోడమే నాగరికత లక్షణం అనే సిద్ధాంతానికి ప్రపంచం త్వరత్వరగా వచ్చేస్తోంది. ఒకళ్ళ యింట్లో ఆరవేసుకున్న పరికిణీ గాలికి ఎగిరి రోడ్డు పక్కగా పడగా రాములమ్మ అనే అమ్మాయి ఆ పరికిణీని తీసుకుందట. ఆమె మీద దొంగతనం నేరం మోపి, వో బండి చక్రానికి గోగునార తాళ్ళతో కట్టి, ఆమె మీద ఆరారా నీళ్లు పోశారట. నీరు తగిలిన కొద్దీ గోగునార బిగవడం వల్ల ఆమె శరీరం మీద కట్లు వాతలు పడినట్టు పడ్డాయట. అంతేగాక, చుట్ట కాల్చి, ఆమె పెదిమల మీద, బుగ్గల మీద, మెడమీద కాల్చారట. ఆ రకంగా ఉదయం ఎనిమిదింటి నుంచి సాయంత్రం ఆరు గంటల వరకు ఆమెను చిత్రహింస పెట్టారట. ఆ ఘోరం చూడలేక, ఆమె తండ్రి బావురు మన్నాడట. అతను పోలీసులకు రిపోర్టిచ్చినా, ఆ పోలీసులు లంచం తీసుకోడం వల్ల ఏ చర్యా తీసుకోలేక పోయారట. ఆ వూరి పెద్ద కలగ జేసుకుని ఆమెను విడిపించారట. ఆమెను మిర్యాలగూడెం ఆసుపత్రిలో చేర్చారట. అదీ అవుటు పేషెంటుగా వో చెట్టు క్రింద ఆశ్రయం యిచ్చారట. ఆ రోజులైనా తాళ్ళగుర్తులూ, కాల్పు పుళ్ళూ తగ్గలేదట. ఇంతకన్నా పశుప్రాయమైన పనులు చేయడానికి యిక వీల్లేదనుకోవచ్చు. ఈ పనికి పశువులతో పోలిస్తే, పశువులు కూడా అభిమాన పడవచ్చేమో!

## రోడ్డు మీద కనపడ్డ చెవి లేని శవం

మైలాపూరు (మద్రాసు)లో రామకృష్ణ సరమ



హంస మఠం రోడ్డుమీద ఒక శవం కనుపించిందట. ఇది ఒక 30—35 ఏళ్ళ వయస్సున్న పురుషునిదట. ఎడమ కన్ను పీకివేసినట్టు, కుడి చెవి కోసేసినట్టు ఆనవాళ్ళున్నాయట. ఈ వ్యక్తి ఎవరో, ఎవరంత ఘోరదారుణంగా హత్య చేశారో, ఎందుకు చేశారో, ఆ శవం ఎవరో యింతవరకూ ఆచూకీ తెలియలేదు. పోలీసువారు దర్యాప్తు ప్రారంభించారు. ఎన్నని చేస్తారు! వాళ్ళూ మనుష్యులేగా!

## ఆరోహణ క్రమంలో రుసుములు

తాడేపల్లి గూడెంలో సెంట్రల్ ఎక్సయిజు ఇనస్పెక్టర్ల చర్యలు చాలా అసహ్యంగా తయారయ్యాయిట. ఎక్సయిజు సందర్భమయిన ఏ పని కయినా సరే టకాయించి దర్జాగా లంచాలు పుచ్చుకుంటున్నారట. ఈ లంచాలు రుసుములుగా ఏనాడో మారి హోదాను సంపాదించుకున్నాయి. వీటికే ఆరోహణ క్రమంలో స్థాయిలు కూడా వున్నాయి. ఫలానా చిన్న పనికి పదయితే మరి కొంచెం పెద్దపనికి పాతిక అవటాని లెక్కలు కట్టి దాచుకున్నారు. అయితే యీ ఇనస్పెక్టర్లను గురించి వారిపై వారికి ఫిర్యాదు చేస్తే వాళ్ళూ ప్రజల గోడు వినటం లేదట. వాళ్ళనని ప్రయోజనం లేదు. వాళ్ళూ పాపం క్రింద నుంచి పరమపద సోపానం మెట్లన్నీ ఎక్కి వెళ్ళిన వారేగా!

## విపరీతాలూ—విశేషాలూ

విపరీతానికో శీర్షికా, విశేషానికో శీర్షికా యిలా ప్రారంభిస్తూపోతే పత్రికంతా శీర్షికల మయం అయ్యే ప్రమాదం వుంది. అదీగాక సామాన్యంగా కనుపించవి ఏ విషయాన్నయినా మనం 'విపరీతం'గా భావించుకో వచ్చుకదా! ఈ లెక్కన 'ఒక వారం విపరీతం' శీర్షికలో విపరీతాలేగాక విశేషాలూ (అవీ విపరీతాలే గనుక) వస్తాయి.

## దయ్యమా! భూతమా?

మురాదాబాద్‌లో 24 తేదీ రాత్రి వో భయంకరమైన ధ్వని వినిపించిందట. దాంతో ప్రజలు భయాందోళనలతో ఇళ్ళు వదలి రోడ్డు మీదికి




పారిపోయారట. ఇదే శబ్దం పోయినసారి వచ్చిందట. ఇది దయ్యమా, లేక భూతమా అని పూరి ప్రజలు భయపడు తున్నారు.

* * *

చందూర్ రైల్వే పోలీసు స్టేషనుకు చెందిన ఉత్తమరావు దోశాట్ అనే కాన్స్టేబుల్ ఇటీవల అమరావతిలో జరిగిన అల్లరుల సందర్భంగా వరుసగా 15 రోజులు విరామంలేని డ్యూటీ నిర్వర్తించాడట. తన భార్యకు ఆ కాలంలో సుస్తీగా వున్నాసరే అతను వెనుకాడలేదట. ఆనక ఆమె చనిపోయిందన్న వార్త వచ్చిందట. అల్లరులు ఎక్కువగా వుండటంవల్ల అతను డ్యూటీని వదలడానికి యిష్టపడక, చివరికి వో రెండు గంటల పర్మిషను తీసుకుని యింటికి వెళ్ళి, తన భార్య శవాన్ని బంధువులకు వప్పగించి దహన సంస్కారాలకు ఏర్పాటుచేసి వచ్చేశాడట. ఇతని కర్తవ్య దీక్షను మెచ్చుకుంటూ పోలీసు సూపరింటెండెంట్ సర్వీసు టికెట్‌ను, 25 రూపాయల నగదునూ బహూకరించాడట.

## మొదటి తప్పు!

తమతో సమ్మెలో పాల్గొనకుండా ఆఫీసుకు వెళ్ళినందుకు నార్త్ యీస్ట్ ఫ్రాంటియర్ రైల్వే సూపరింటెండెంట్ యింటి మీదికి వో అయిదువేల మంది వెళ్లేసరికి ఆయన వినమ్రుడై బయటికివచ్చి, చేతులు జోడించి "బాబూ, యీ తప్పు మన్నించండి. మీరింకోసారి సమ్మెచేస్తే నేను ముఖ్యపాత్ర వహిస్తాను" అన్నారు.

## బాంబు ప్రేలితే?

విజయవాడకు 114 మీటర్ల దూరంలో రైలుకట్ట దగ్గర ఒక నాటురకం బాంబు కనుగొనబడిందట. ఈ బాంబు ఎవరు, ఎందుకు పెట్టి వుంటారో, ఎప్పుడు పెట్టి వుంటారో యింకా తెలలేదు. ప్రేలేలోగా బాంబును పట్టుకోడం శుభసూచికం అని ఆనందిద్దాం.

## పెళ్ళీడు

వివాహ వయస్సు హద్దును భారత ప్రభుత్వం కొంచెం అసింటా జరిపిందట. ఈ లెక్క ప్రకారం మగవారు 21 సంవత్సరాల్లోపున, ఆడవారు 18 ఏళ్ళలోపున వివాహం జరుపుకోరాదట. అయ్యో! ఈ రోజుల్లో భారత ప్రభుత్వం కనికరించి యిచ్చిన యీ పరిమితి వయస్సు వారు మన లెక్కల్లో మరీ చిన్న పిల్లల క్రిందకదా జమ! 25—26 ఏళ్ళుదాటిన ఆడవాళ్ళూ, 30 ఏళ్ళు దాటిన మగవాళ్ళూ యింకా వివాహ విషయాల జోలికి పోనివాళ్ళు, పోలేనివాళ్ళు ఎంతమంది వున్నారు — మీరే చెప్పండి! ●

ధర్మపథం

# సేవా పద్ధతి




## బులుసు వెంకటరమణయ్య

సేవించడమనేది సర్వసాధారణమయినా, అందులో ఒకటి నిర్బంధ రూపమైనది. ఇంకొకటి యిచ్ఛారూపమై వుంటుంది. జీవిక కోసం చేసే ఉద్యోగాదులూ అవీ నిర్బంధ సేవలు. అవి తప్పనిసరిగా చేసేవి. వాటిలో ఆనందం అరుదు. ఉత్సాహం తక్కువ. భగవత్సేవ స్వేచ్ఛా రూపమైనది. అందులో ఒకరి నిర్బంధం లేదు. అందువల్లనే అది మనస్సుకు ఎంతో నచ్చుతుంది.

ఉద్యోగం మొదలైనవి చేసేటప్పుడు ఏదో ఒక విధమైన పని నియమితమై ఉంటుంది. ఆ వుద్యోగి తనకు నియతమైన పనిమాత్రం చెయ్యవలసి వుంటుంది. చేసే పనులనుబట్టి ఆర్థికరంగానూ, హోదాలోనూ, గౌరవంలోనూ హెచ్చుతగ్గులు వుంటాయి.

అయితే— భగవత్సేవకులైన భక్తులలో మాత్రం యిలాటి వ్యత్యాసం లేదు. భగవదర్చన చేసే పూజారీ, గుడిని ఊడ్చే నౌకరూ సమానమే! కలిగిన కుటుంబంలో పుట్టి విష్ణు భక్తులకు సకలోపచారాలతో నిరతాన్న ప్రదానం చేస్తూ, భగవంతుడికి మాలా కైంకర్యం చేస్తున్న విష్ణుచిత్తుడు. 'గృహ సమ్మార్జనమో, జలాహరణమో, శృంగార పల్యంకికా వహనంబో ... వాల్లభ్యలభ్యధ్వజ గ్రహణంబో' అని అన్ని కైంకర్యాలనూ సమానంగానే చూచేవాడు. భగవద్విషయంలో చేసే సేవలకు వ్యత్యాసం తలపెట్టకూడదు. అది ఉత్తమ భక్తుడి లక్షణం కాదు.

దేవాలయంలో కూడా— ఇతరత్రా వలెనే ఒక్కొక్క పనిని ఒక్కొక్కరు చూసుకుంటారు. అన్నీ ఒక్కరే చెయ్యడం సాధ్యమూ కాదు. ఒక వూళ్ళోవున్న దేవాలయంలో ఒక భక్తుడికి పువ్వులు తేవడమూ, మరొకనికి చక్కగా మాలలను తయారు చెయ్యడమూ పనులు! పువ్వులు తెచ్చే ఆయన చీకటితోనే బయలుదేరి తోటలకు పోయి ఉదయానికి పూవులుతెస్తే, రెండో భక్తుడు దేవాలయంలో సుఖంగా కూచుని ఆ పువ్వులతో చక్కని మాలికలు కట్టేవాడు. కొన్నాళ్ళకి మొదటి భక్తుడికి 'నేను కష్టపడి పువ్వులు తేవడమూ వీడు లక్షణంగా కూర్చుని మాలికలు కట్టడమూనా ? 'ఎంత బాగావున్నాయో' అని అందరూ మెచ్చుకోవడమూ ?' అని మనస్సులో తోచింది. ఒకమాటు ఉండబట్టలేక అతన్నిచూసి 'ఏమయ్యోయ్! నేను చచ్చి, చెడీ పువ్వులుతెస్తే నువ్వు మాలలు కడుతున్నావు సుఖంగా కూర్చుని. నీపాటి నేనూ కట్టగలను; ఇంతకంటే బాగా కూడాను.' అని అనేశాడు. అతడు చిర్నవ్వు నవ్వి ఊరుకున్నాడు.

ఒకప్పుడు దేవాలయం పనిమీదనే మాలికలుకట్టే ఆయన రెండు రోజులు పాటు గ్రామాంతరం వెళ్ళవలసి వచ్చింది. మొదటి ఆయన పూవులు తేగానే అర్చకుడు 'అయ్యా! మీకు దండలు కట్టడం బాగా తెలుసునుకదా! మాలాకైంకర్యం చేసే ఆయన గుడి పనిమీదనే మరోవూరికి వెళ్ళారు. మీ ఆసరా చూచుకునే ఆయనను పంపించాం. రెండురోజులుపాటు మీరే దండలు కట్టండి' అన్నాడు. 'పువ్వులు తేవడమే నాపని; దండలు కట్టడం నా పనికాదు.' అని చెపుతూ రెండో ఆయన అక్కడినుంచి వెళ్ళిపోయాడు. నాడు దేవుడికి మాలాకైంకర్యం లేకుండానే అర్చన జరిగింది. ఆ లోపం అందరికీ స్పష్టంగా కానవచ్చింది.

తాను భగవంతుడి విషయంలో అపచారం చేశానని గుర్తించని ఆ సేవకుడు మర్నాడు తెల్లవారకుండానే పువ్వుల కోసం బయలుదేరాడు. ఎన్నితోటలకు పోయినా, ఎంత తిరిగినా ఒక్క పువ్వు కూడా దొరకలేదు. ఉత్తచేతులతోనే గుడికిపోయి, ముఖం వేలవేసుకుని అర్చకుడితో ఆ సంగతి

(24వ పేజీ చూడండి)

# మిల్క్‌మెయిడ్ వాడుట మీ నిత్యవిధిగా చెయ్యండి

తీపియైన మిల్క్‌మెయిడ్ గడ్డ పాలు కాఫీ, టీలలో కలుపుటకు అనువైనవి...దివ్యమైనవి. వీటితో కాఫీ, టీల రుచి ఇతోధిక మవుతుంది. వీటితో మీరు పంచదారను పొదుపు చేయగలరు. ఎందుచేతనంటే మిల్క్‌మెయిడ్ గడ్డ పాలలో శుద్ధిచేయబడిన పంచదార చేర్చబడినది! ఈ రోజే రెండు డబ్బాలు మిల్క్‌మెయిడ్ గడ్డ పాలు కొనండి. వీటిని మీరు ఎన్నో విధములుగా వాడవచ్చును. మిల్క్‌మెయిడ్ అంటే శుద్ధమైన, తాజాయైన మరియు రుచియైన పాలు!




వీటిని కలిపి తీపి వస్తువులను చేస్తే అవి ఎక్కువ రుచిగా వుంటాయి




ఇవి పండ్లతోను, 'పుడ్డింగ్' తోను తినుటకు దివ్యంగా వుంటాయి




ఇవి మీ బిడ్డకు సహజమైన పోషణ నిస్తాయి

ఇప్పుడు విరివిగా లభిస్తున్నాయి

**తీపియైన మిల్క్‌మెయిడ గడ్డ పాలు—**

**ఇవి ఉత్కృష్టమైనవని మీకు తెలియును, ఎందుచేతనంటే ఇవి నెస్లేవారి తయారు!**




వర్షం సన్నగా పడుతోంది. ఆ మాత్రపు జల్లును యెవ్వరూ లెఖ్ఖచేయకుండా ఎవరి పనులలో వారు మునిగారు. వాతావరణం చల్లగా వుంది. ఎండలో వేడెక్కిన భూమి వర్షానికి చల్లబడింది. సునంద కిటికీలో కూర్చొని ముందుగా వున్న యింటి వైపు తదేకంగా చూస్తోంది.

"అమ్మాయి నందా ఇదిగో ఇది త్రాగమ్మా" అంటు సుమిత్రమ్మగారు సునంద దగ్గరికొచ్చి గ్లాసు అందించారు.

"ఏం చేస్తున్నావిక్కడా?"

తల్లి ప్రశ్నను వినిపించుకోకుండా తిరుగు ప్రశ్న వేసింది సునంద.

"ఏవిటే ఇది?"

"షర్బతమ్మా, నిమ్మకాయ ఒకటుంటే, కొన్ని పంచదార కలిపి చేశాను." అంటూ కిటికీలో నుండి బైటికి చూసింది. ఇంటి ముందు రోడ్డుపై యెవ్వరూ కనుపించలేదు.

"ఏం చేస్తున్నావ్? ఏం లేదుగా" అంటూ లోనికెళ్ళి పోయింది సుమిత్రమ్మ.

సునంద యింటి ముందు వున్న గది వైపు చూస్తూ కూర్చుంది. ఆమె అతని గూర్చే ఆలోచిస్తున్నది. అతని గూర్చి రోహిణి చెప్పింది విన్న దగ్గరి నుండి అతనితో మాట్లాడాలనుకుంటున్నది. కాని ఎలా?

అతను చాలా మంచివాడు. తలవంచుకొని తన పనేదో తను తప్ప దిక్కులు చూడడు. పాపం కుంటివాడైనా బాగానే వుంటాడు. రోహిణి చెప్పిన దాని బట్టి అతనికి 'నా' అనేవారు ఎవ్వరూ లేరట. ఒంటరి జీవితంట. తను అతనితో

మాట్లాడాలనుకున్నా ఎలా మాట్లాడగలదు? అతనేమనుకుంటాడు?

రోజా అతనే వండుకుంటాడుట. ఒకసారి ధైర్యం చేసి మాట్లాడాలని చూసింది. కాని ఎలా మాట్లాడగలదు? అతనే మనుకుంటాడు? కాని ఎందుకో పలుకరించే ధైర్యం లేకపోయింది.

వర్షం కాస్త పెద్దదైంది.

సునంద లేచి రీడింగ్ రూంలోకి నడిచింది. టేబుల్‌పై వున్న నవల తీసింది. ఈజీచేర్‌లో కూర్చొని మొదటి పేజి త్రిప్పింది. అందులోని మొదటి రెండు లైనులు చదివినా అర్థం కాలేదు. ఆలోచనలు ఆమెను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. సమయం గడపాలంటే ఏదో ఆలోచనలతోనే గడపాలి. అందుకే మెల్లిగా కళ్ళు మూసుకుంది.

"గది అద్దెకివ్వబడును" అని యాడాదికి పైగా ఖాళీగా వున్న గది రెండు నెలల క్రితం వరకు ఖాళీగానే వుండిపోయింది. దయ్యాల కొంపగా ప్రసిద్ధికెక్కటంతో ఆ గదిని ప్రవేశించే ధైర్యం ఎవరికీ లేకపోయింది. రెండునెలల క్రితం ఒక సాయింకాలం తను కిటికీలో కూర్చొని నవల చదువుతోంది. అప్పుడు యింటి ముందుగా వో రిక్షా వచ్చి ఆగింది. అందులోంచి అతను దిగాడు. అతను ఎవరో, ఎక్కడికొచ్చాడో అర్థంకాక తికమక పడింది తను.

అతను రిక్షాలోని సూట్‌కేసు, పెట్టెతో దిగాడు. ఇంటివారమ్మాయి రోహిణి ఆ గది తలుపు తాళాలు తెరవటంతో అతను తన సామానుతో గది ప్రవేశించాడు. అతనికి అది దయ్యాల కొంపని తెలియదు కాబోలు. అతను గబగబా మామూలు వ్యక్తిలా నడుస్తూ గదిలో కెళ్ళాడు. అతనికి చెక్కకాలు వుందిట! రోహిణే చెప్పింది. అతనితో చనువుగా ఉంటుందిట. అతను తనకు 'అన్నయ్య' లేని కొరత తీరుస్తున్నాడట.

"మరి ఆయన్ని ఆ దయ్యాల కొంపలో ఉంచావేం?" అడిగింది రోహిణిని తను.

"నేనూ మొదట్లో వద్దన్నాను. ఎన్నో కథలు కల్పించి కూడా చెప్పాను. ఆయన తేలిగ్గా నవ్వేసి, అటువంటి భయాలు నాకేవీ లేవు నేను దయ్యాలంటె నమ్మను. నేనో ప్రత్యేక పని మీద వచ్చాను, ఆ పని అయిపోగానే వెళ్ళిపోతాను, దానికి మీ సహాయం కూడా కావల్సి వుంటుంది, అన్నాడు, మరి నన్నేం చేయమంటావ్?" అంది రోహిణి తన తప్పేమీ లేనట్లు.

"ఆయనేం చదివారు?" అంటూ తను రోహిణినో రోజా ప్రశ్నించింది.

"ఆయన ఇంజనీరింగ్ పాసైయ్యారట, పాపం మిషన్‌లో కాలు యిరుక్కొని పోయిందిట." అంటూ రోహిణి జాలిగా మొహం పెట్టింది.

"పోని రోహిణి అతన్ని నాకు పరిచయం చేయరాదూ?" అనాలనుకొని అనలేకపోయింది.

ఒకసారి అమ్మ దగ్గర అతని ప్రస్తావన తెస్తె "నీ కెందుకే ఆ కుంటి వెధవ సంగతి" అంటూ మాటలు మార్చింది. ఎప్పుడు అతని ప్రస్తావన తెచ్చినా అమ్మ మాటలు మార్చేది.

ఒకసారి తను, రోహిణి మేడ మీద కూర్చొని ఏదో మాట్లాడుకుంటుండగా అతను గది తలుపుకు తాళం వేసి ఎటో వెళ్ళిపోయాడు. రోహిణి అతన్ని చూసి అంది. "అతని పేరు శ్రీధరట. ఆగదిలో వుండటానికో ప్రత్యేకమైన కారణం వుందిట. అది ఎంత చెప్పమన్నా చెప్పడు. చాలా విచిత్రమైన వ్యక్తి అతను." అంది.

రోజా అతన్ని అదే సమయానికి రోడ్డుపై చూసేది తను. ఎందుకో అతనంటె అభిమానం ఏర్పడింది. బహుశా రోహిణి చెప్పే విషయాలే దానికి కారణం కావచ్చు.

రోహిణి బలవంతంపై ఒకసారి అతను స్నానానికని వెళ్ళినప్పుడు అతని గదిలో కెళ్ళింది. అతని గది అందంగా అలంకరించబడి వుంది. అతని చెక్కకాలు మంచం కోడుకు ఆనించి వుంది. దాన్ని చూడగానే తన మనసు చివుక్కుమంది. దేవుడు నిర్దయుడు మంచివారికే కష్టాలు తెస్తాడు, అనుకొంది మనసులో.

అతని ఫోటో గోడకు తగిలించి వుంది. ఎందుకో అతనంటే ఒక సద్భావం తనలో ఏర్పర్చుకున్నది. "రోహిణి', అతనేం చేస్తుంటాడే ఎప్పుడూ." అడిగింది, అతని నిత్యకృత్యాల గూర్చి తెలుసుకోవాలని. "అన్నట్లు చెప్పటం మరిచాను అతను కథలు కూడా వ్రాస్తాడే." అంది రోహిణి

ఇంతలో ఏదో అలికిడి అవ్వగానే ఇద్దరు బైటికి వెళ్ళిపోయారు.

ఆలోచనల్లో సునందకు తల భారంగా వున్నట్లనిపించి కళ్ళు మూసుకొని నిదురపోయింది.

* * *

ఉలిక్కిపడి లేచింది సునంద. కళ్ళు నులుముకొంటూ చుట్టూ చూసింది. ఎవ్వరు కనుపించక పోయేసరికి లేచి ఒళ్ళు విరుచుకొని ఆవలించి కిటికీ వైపు చూసింది.

ఆకాశంలో మబ్బులు దట్టంగా అల్లుకొన్నాయి. వర్షం పెద్దగా వస్తోంది. మెల్లిగా ముందు గదిలోని కిటికీ వైపు నడిచింది.

బహుశా 'మగత నిదుర' పట్టినట్లుంది. అందుకే ఒళ్ళంతా భారంగా వుంది. ముందు గదివైపు చూసింది. వేసిన తలుపులు వేసినట్లే వున్నాయి. టైం చూసింది. రెండైంది. అతను ఇంకా తలుపులు తెరువలేదు. రోజు ఈవేళకి తెరిచేవాడే! ఆశ్చర్యపోయింది సునంద.

వర్షానికి యింటి ముందు నీరు కాల్వలు కట్టింది. చెదిరిన జుట్టు సవరించుకొని జడ నల్లుకొంటూ వంటింట్లోకి నడిచింది.

"నందా మొహం కడుక్కొని రామ్మా 'టీ' ఇస్తాను." అంటూ సుమిత్రమ్మగారు 'టీ' గిన్నె క్రిందికి దించారు.

మొహం కడుక్కొని తల్లి ముందు పీట వేసుకొని కూర్చున్నది నంద.

"అమ్మా పాపం ఆయన మంచి వారటనే."

"ఎవరే?"

"ఆయనే శ్రీధర్ గారు."

"అమ్మాయి, అస్తమానం వాడి గూర్చే ఆలోచిస్తావేమే, చూడుతల్లి అటువంటి వారి గూర్చి ఆలోచిస్తె వున్న సమయం వృధా అవుతుంది. చూడమ్మా ఇవాళ్ళ ఏదో రాముడి గూర్చి సినిమా వచ్చిందిట, వెళ్దామే?" అంటూ మాట మార్చటంతో సునంద నిరుత్సాహ పడింది.

"నందా" అంటూ రోహిణి పిలవటంతో లేచి ముందు గదిలోకి నడిచింది నంద.

"నీతో ఒక ముఖ్యవిషయం చెప్పాలి మేడ మీది కెళ్దామా?" అడిగింది రోహిణి.

"పద" అంది నంద.

ఇద్దరూ మేడ నెక్కారు.

"పాపం అతనికి బాగా జ్వరం వచ్చిందే నందా?" అంది రోహిణి.

"ఎవరికే" అంది సునంద సగం అర్థం చేసుకొని.

"అతనికే శ్రీధర్‌కి. పాపం భోజనం చేయకుండా పడుకొనున్నాడు. నేను జావ కాచి యిచ్చాను. పాపం త్రాగుతూ కన్నీళ్ళు పెట్టుకున్నాడు. "ఎవరూ లేని నాపై ఎందుకు చెల్లీ నీకింత జాలి." అంటూ తనతో అనేసరికి నిజంగా ఎంత బాధపడ్డానో" అంది రోహిణి.

తన హృదయాన్నెవరో కెలుకుతున్నట్లనిపించింది సునందకు.

"నందా నీవు రావే, పాపం అతను ఒంటరిగా ఎప్పుడూ బాధపడుతుంటాడు. కాసేపైన మనం మాట్లాడితే సమయం గడుస్తుంది. వస్తావా?" అడిగింది రోహిణి.

"ఇప్పుడేనా? అమ్మ చూస్తే కోప్పడుతుంది."

"మా యింటికి రా, సోవలి తలుపు నుండి అతని గదిలో కెళ్దాం, అప్పుడెలా తెలుస్తుందేం మీ అమ్మకు?" అంది రోహిణి సునందను బలవంతం పెడ్తూ.

"కాసేపాగి వస్తాలేవే ఇప్పటికి పదండు." అంటూ సునంద అనటంతో ఇద్దరూ ఏవో యితర విషయాలు మాట్లాడుకొని విడిపోయారు.

అరగంట గడిచాక సునంద అందంగా అలంకరించుకొని తల్లితో చెప్పి రోహిణి ఇంటి వైపు నడిచింది.

ఇద్దరు శ్రీధర్ గదిలో కెళ్ళారు.

వారిని చూడగానే శ్రీధర్ లేచి ప్రయత్నం చేస్తు "రండి కూర్చొండి" అన్నాడు.

"కూర్చోవే" అంది రోహిణి అతని ముందుగా ఒక కుర్చీని లాగుతూ.

సునంద కుర్చీపై కూర్చున్నది.

"ఈమె పేరు సునంద" అంది రోహిణి పరిచయ వాక్కులా.

"తెలుసు." అన్నాడతను చిరునవ్వుతో.

సునంద ఆశ్చర్యపోయింది.

## మృగత

"అన్నయ్యా ఈమెతో మాట్లాడుతూండు యిప్పుడే వస్తాను" అంటూ రోహిణి గది నొదిలి వెళ్ళిపోయింది.

సునంద తలవంచుకొని కూర్చుంది.

"మీరేమయినా చదువుతున్నారా?" అడిగాడు శ్రీధర్ మౌనం భంగం చేస్తూ.

"లేదు." అంది క్షణం అతని వైపు చూస్తూ.

"ఎంతవరకు చదివారు?"

"ఎసెల్‌సీ పాసైయాను." అంది తలదించుకొని.

"మీ గూర్చి రోహిణి నాకు తరుచుగా చెబుతూంటుంది."

"......................................"

"మీరు నవలలు చదువుతారా?"

"ఔ" నన్నటు తలూపింది సునంద.

"మీకు ఎవరి నవలలు నచ్చుతాయి?" ప్రశ్నించాడు. ఏ ఇతర విషయం చర్చించటానికి దొరక్క.

"ఎవరి పంటె ఏం చెప్పను? దుఃఖాంతం అంటె యిష్టం." అంది ఏదో అభిప్రాయం తప్పకుండా చెప్పాలని.

"నవలలే నిజమయితె...", దగ్గు తెర అడ్డం రావటంతో అతను ఉక్కిరిబిక్కిరైయ్యాడు. సునంద గాభరా పడింది.

ఇంతలో రోహిణి వచ్చింది.

"ఏం జరిగిందన్నయ్యా?"

"ఏమీ లేదమ్మా." అంటూ ఆయాసపడుతూ అన్నాడు.

"ఏం జరిగిందే?" అంది సునంద నుద్దేశిస్తూ.

"దగ్గుతెర అడ్డం వచ్చిందే." అంది నిజాన్ని చెబుతూ.

"నాతో అబద్ధం ఆడుతావేం అన్నయ్యా?" అంది రోహిణి.

శ్రీధర్ చిరునవ్వు నవ్వాడు.

సునంద కూర్చున్న గంటసేపు మూగవ్రతం పటినట్లు నిశబ్దంగా కూర్చొని తరువాత ఇద్దరి దగ్గరా సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయింది.

కొన్ని సంఘటనలు విచిత్రంగా జరుగుతాయి. ఒకోసారి అవి జరిగేదాకా జరుగుతాయనిపించదు. అందుకే ఓ సామెత కూడా వుంది. పెళ్ళొచ్చినా కక్కొచ్చినా ఆగదు అని.

సునంద వివాహం నిశ్చయం అయింది. సుమిత్రమ్మ గారి ఆనందానికి అవధులు లేకపోయాయి. ఆమె తన కూతురు అనుభవించబోయే ఐశ్వర్యాన్ని వూహించి ఆనందంతో పొంగిపోతోంది. ఔను మరి. సంతానం సుఖంగా వుంటె ఏ తల్లి సంతోషించదు?

"సునందా, అమ్మాయి నందా!" పెద్దగా కేకేసారు సుమిత్రమ్మగారు.

"ఏమిటే" అంటూ వచ్చింది సునంద.

"అమ్మాయి అదృష్టవంతురాలివే తల్లి." అంది ఆమె. తల్లి ధోరణి అర్థంకాక ఆశ్చర్యపోయింది సునంద.

"నీకు తగిన వరుడు దొరికాడే. మీనాన్న నీకు వివాహం నిశ్చయించారు."

"ఏమిటే నాకు పెళ్ళా"?

"అవునే నాన్నగారు మాట్లాడి వచ్చారు. ఫారెన్ రిటర్న్‌డ్‌ట. నెలకు వెయ్యిరూపాయిల జీతంట, ముహూర్తం కూడా నిశ్చయం అయింది" అన్నారామె సునంద ఆనందంతో పొంగిపోతుందనుకొని.

"అమ్మా నన్నడగకుండా నాపెళ్ళి ముహూర్తం నిశ్చయిస్తారా?" అంటూ బాధగా ప్రశ్నించింది.

"అదేమిటే సంతోష పడ్తావనుకుంటె ఎందుకలా మాట్లాడుతావ్"?

"అదికాదే..............."

"ఏదికాదే, నీకేమీ తెలియదు, నువ్వూరుకో" అంటూ అక్కడి నుండి గబగబా నడిచి వెళ్ళిపోయింది.

సునంద ఏదో ఆలోచిస్తూ కూర్చుండిపోయింది.

* * *

"జరిగింది వింటె బాగూర్చి నీకు అర్థమవుతుంది సునంద. అసలీ సమయం కోసమే నేను ఇన్ని రోజాలు వేచి వున్నది". శ్రీధర్ సునంద కళ్ళల్లోకి సూటిగా చూస్తూ చెప్పుకొని పోతున్నాడు.

ఆమె అతని వైపు రెప్పార్పకుండా చూస్తోంది.

"నేను మా తలితండ్రులకు ఏకైక సంతానాన్ని. అందుకే నన్ను అతిగారాబంగా చూసేవారు. మాయింటికి అతిథులు ఎక్కువగా వచ్చేవారు కాదు. నాకు తెలిసిన బంధువు మా మావయ్యొక్కడే. ఆయన కూడా వ్యాపార రీత్యా వస్తూ వెళ్తూండేవాడు. ఆయన దగ్గరకూడా నాకు చనువు ఏర్పడింది. ఆయన నన్నెంతో ప్రేమగా చూసేవాడు.

"వాడంటే ఎందుకంత ముద్దన్నయ్యా నీకు?" అంటూ అమ్మ ఒకసారి అడిగింది.

"వాడేనే నా అల్లుడు" అంటూ నవ్వేవాడు.

"ఒరే శ్రీ, బుజ్జిని చేసుకుంటావురా?" అనేది అమ్మ పెళ్ళంటే తెలియని ఆ వయసులో. "వో" అంటూ తలూపే వాడిని. అమ్మ సంబర పడేది.

నాకు పదవ సంవత్సరం ప్రవేశించింది. నాకు దురదృష్ట ఘడియలు ప్రారంభమైయ్యాయి. ఒక రోజు కారు ఆక్సిడెంటుతో మా అమ్మకు నాన్నకు బలమైన గాయాలు తగిలాయి. వారు ప్రాణాలపై ఆశలు వదులుకున్నారు. మా మావయ్య అప్పుడు అక్కడే వున్న కారణాన ఆయనను పిలిచి నాకు నాఆస్తికి గార్డియనుగా చేసి వారు కళ్ళు మూశారు. మావయ్య నన్ను అదే యింట్లో వుంచి కొందరు నౌకర్లను నియమించి వారానికోసారి వచ్చి నాక్షేమ సమాచారాలు తెలుసుకుంటుండేవాడు. నేను చదివి ఇంజినీర్నైయ్యానంటే ఆయనే కారణం. నేను పాసైన రోజు ఆయనెంతో సంతోషించారు. ఆయన నాకో పెద్ద ఫ్యాక్టరీలో వుద్యోగం యిప్పించారు.

"మావయ్యా బుజ్జిని చూపించవా?" అంటూ అనేకసార్లు అడిగాను.

"మీ అత్తయ్యకు కావల్సింది పూర్తికాగానే తీసుకెళ్తాను బాబు." అనేవాడు. ఆమాటల్లోని అంతర్యం అర్థం కాకున్నా, బుజ్జిని వూహించుకుని తృప్తి పడేవాడిని.

ఒకసారి నాకాలు మిషన్‌లో ఇరుక్కొని విరిగి పోయింది. నెలరోజులు స్పృహ లేకుండా ఆసుపత్రిలో పడ్డాను. మావయ్య సంగతి నాకేమి తెలిసేది కాదు. ట్రీట్‌మెంట్ పూర్తికాగానె చెక్కు కాలు సంక్రమించింది. అప్పట్లో నేనంటే నాకే అసహ్యమనిపించేది. చచ్చిపోవాలని చేసిన ప్రయత్నాలన్నీ వృధా అయిపోయేవి."

అతను స్వేద బిందువులతో తడిసిముద్దైయాడు, చెప్పటం ఆపలేదు. సునంద కళ్ళనొని నీరు బుగ్గలమీదికి జారి చారిక లేర్పరిచాయి.



# ఉదయమందలి తాజాదనము గంటల కొలది వుండేలా చేసుకోండి...

దానికి కావలసినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం! ఉదయం స్నానానంతరం పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కంను ఒళ్లంతా జల్లుకొంటే తాజాదనము, హాయిని గంటల కొలది వుంచుతుంది. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం యొక్క తేలికైన పరిమళము వొంటి మీద రోజంతా నిలిచి వుంటుంది. చెమటను త్వరగా పీల్చే గుణము గల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం మండే ఎండలలో ఉక్కబోసే వాతావరణములో మిమ్మల్ని సేద దేర్చి, తాజాగా, హాయిగా, పరిమళంతో వుంచుతుంది. సంవత్సరమంతా అన్ని వాతావరణములలోను మీరు వాడదగినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం!




## పాండ్స్

డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం —

ఎంతో మెత్తటి మేలు రకం టాల్కం

రిజిస్టర్డ్. పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

# మగత

రోహిణి నిశబ్దంగా పైన కాలచక్రంలా తిరుగుతున్న ఫ్యాను కేసి చూస్తోంది. అవును మానవ జీవితాల్లో జరిగే కొన్ని సంఘటనలు తల్చుకుంటే ఎవరి గుండె కరగదు?

"చివరికి విసిగి యిల్లు చేరాను. కాని దురదృష్టం నన్ను వదల్లేదు. మావయ్య ఇల్లు అమ్మేశాడట. తల తిరిగినట్లనిపించింది. చేతిలో డబ్బులేని నేను ఏమీ చేయలేక ఫ్యాక్టరీ యజమానిని ఆశ్రయించాను. ఆయన జాలి తలచి ఐదువేల రూపాయిల చెక్కు వ్రాసి మావయ్యపై కేసు వేయమన్నాడు. అందుకే బైల్దేరి వచ్చేశాను. ఆయనను కలిసాను విడిగా, ఎందుకంటే మా అత్తయ్య తత్వం నాకు బాగా తెలుసు.

ఆయన నన్నూ నా పరిస్థితిని చూసి జాలిపడి 'నాయనా నీవే చెప్పు నీకు నా కూతురునిచ్చి వివాహం చేస్తే అది సుఖపడుతుందా? దాని వూహలు, దానికున్న అభిప్రాయాలు ఎటువంటివో? దాని కిష్టం లేకుండా దాన్ని నీకిస్తే నిన్ను సుఖపెట గలదా? అందులో నీ అత్తయ్య సంగతి నేను వేరే చెప్పక్కర్లేదు. నామీద కేసు వేసావు, ఫరవాలేదు, నీదీ న్యాయమే ఒప్పుకుంటాను. ఇదంతా నేను చేస్తున్నానంటే మీ అత్తయ్య ప్రోద్బలమే. నన్ను క్షమించు నాయనా'' అంటూ గబగబా వెళ్లిపోయాడు.

ఆయన్ని చూసి నవ్వుకున్నాను. లోకంలో ఇటువంటివారు కూడా వుంటారా భగవాన్ అనుకొని. బుజ్జిని చూడాలన్న కాంక్ష అధికం అయింది. అందుకే మావయ్య ఇంటిముందు గది అద్దెకు తీసుకున్నాను, ఇంటమ్మాయి రోహిణి ద్వారా నిన్ను పరిచయం చేసుకున్నాను బుజ్జీ." అన్నాడు. శ్రీధర్ సునంద కళ్ళల్లోకి చూస్తూ.

ఆమె చెక్కిళ్ళు కన్నీటితో నిండి పోయాయి. అతన్నే చూస్తోంది.

"సునందా చూశావా లోకం ఎటువంటిదో? మావయ్య నాకెంత అన్యాయం చేశాడో? కుంటివాడ్ని ఎలా బ్రతుకుతాననుకున్నాడో నీవే చెప్పు. నాకు 'నా' అనతగ్గ మావయ్య నన్ను అన్యాయం చేస్తే ఎలా బ్రతకాలి?" అతని కళ్ళల్లోని నీరు కళ్ళలో నిలువలేక పోయాయి.

సునంద లేచి గబగబా వెళ్ళిపోయింది.

శ్రీధర్ ఖాళీకుర్చీని చూసి పిచ్చిగా నవ్వుకున్నాడు.

*   *   *

పెళ్లి పందిరి ఘనంగా వేశారు. 'వెంకటేశ్వరరావుకు సునందకు వివాహం' పిచ్చిగా నవ్వుకున్నాడు. శ్రీధర్ కిటికీలో నిలబడి అలంకరణలను చూస్తూ. సునంద వివాహం గొప్పవాడితో జరుగబోతోంది. ఆమెను చూడాలనుకున్నాడు, చూశాడు. ఆమె సుఖాన్ని మించి తను ఏం కోరగలడు? సునంద జీవితంలో మరచిపోని పెళ్ళికానుక యివ్వాలి. తన జీవితం ఎలాగూ ఏడారి బాటైంది. ఆమె సుఖాన్ని మించి తను కోరదగింది మాత్రం ఏముంటుంది?

సునంద అందంగా వుంది. తనకు కాకుండా చేశాడు భగవంతుడు.

ఇంటిముందు పచ్చని తోరణాలతో అందమైన రంగుల బల్బులు పెట్టారు. శ్రీధర్ కిటికీ చువ్వల్ని వదిలి వెనక్కు తిరిగాడు.

సునంద తలవంచుకొని వుంది.

"నందా" అన్నాడు ఆశ్చర్యంగా.

"నీతో ముఖ్యవిషయం మాట్లాడటానికి వచ్చాను." ఆమె బుగ్గలపై నిలబడిన నీటిబిందువుల్లో ఆమె బాధనంతా దాచుకున్నట్లున్నది. అతను ఆమె వైపు చూస్తూండి పోయాడు.

"బావా నీకీ పెళ్ళిజరగటం ఇష్టమేనా?" అడిగింది తలవంచుకొనే?

అతను నిశబ్దంగా వుండి పోయాడు.

"బావా నేనంటే నీకెటువంటి అభిప్రాయముంది ?"

అతను నిశబ్దంగా వుండి పోయాడు.

"నీవంటె నాకు గౌరవమే కాదు. ప్రేమ కూడా వుంది బావా."

అతను ఏమీ మాట్లాడలేదు.

"బావా నిన్ను చూడకుండా వుండలేక పోతున్నాను. నీకూ తోడు కావాలి. నాకా అదృష్టం కలిగించాలని ప్రార్థిస్తున్నాను. నాన్నగారు, అమ్మా నీకు చేసిన అన్యాయాన్ని క్షమించు బావా!" అంది అతని దగ్గిరిగా జరుగుతూ.

అతను మవునంగా వుండిపోయాడు.

"నన్నర్థం చేసుకొనుంటావు, ఇవాళ రాత్రి నా వివాహం. నేను నిన్ను వదిలి వెళ్ళాల్సివుంటుంది, అలా కాకుండా నన్ను నీవొక్కడివే రక్షించ గలవు బావా."

అతను ఆలోచిస్తున్నాడు.

ఒకోసారి జరుగదనుకున్నది జరుగుతున్నప్పుడు మానవుడు మూగవాడై పోతాడు. ఆనందంలో ఏదీ మాట్లాడలేడు. అటువంటి పరిస్థితుల్లో శ్రీధర్ మవునంగానే వుండిపోయాడు.

"బావా నీవు పరాయి వాడవుకాదు. ఆలోచించు." అంది అతని చేతిని పట్టుకొని.

శ్రీధర్ ఆలోచిస్తున్నాడు.

"బావా రాత్రి తప్పించుకుని వచ్చేస్తాను. యిద్దరం ఎక్కడికైనా వెళ్ళిపోదాం వద్దనకు బావా?' అంది అతని నూపుతూ.

అతను నిశబ్దంగానే వుండిపోయాడు.

"బావా మవునం అంగీకారమేగా?"

"నందా లోకం ఏన్నేమంటుందో తెలుసా?"

"ఫరవాలేదు. నా ఆనందం నా బావ ఆనందం కోసం ఏమాటైనా భరించగలను." అంది సునంద ధృఢ విశ్వాసంతో.

"నందా నేను కుంటివాడ్ని.........."

"ఏమిటామాటలు బావా ఆమాటలనేకంటే నన్ను..............."

"నందా క్షమించు" అతను నిశబ్దంగా వుండిపోయాడు.

"బావా నీతో జీవనంకు మించి నేనేమీ కోరను.

ది గుర్తిస్తే చాలు, బావా. నేను చెప్పింది మరిచి పోవుకదూ. ఎక్కడికైనా వెళ్లిపోదాం." అంటూ అతని సమాధానాన్ని ఆశించకుండా గబగబా వెళ్లిపోయింది.

శ్రీధర్ ఆలోచిస్తూ వుండి పోయాడు.

* * *

పెళ్ళిపందిరి సన్నాయి శబ్దంతో నిండిపోయింది సునంద పెళ్ళికూతురిలా అలంకరింపబడింది. నీలివర్ణం పట్టు చీర అదేరంగు జాకెటు పై సన్నటి జరీలతో డిజైను, పసుపురంగు పారాణి, చేతులకు రాళ్ళగాజులు, నుదుటన ఎర్రటిబొట్టు, బుగ్గన నల్లటి కాటుక చుక్క, పొడుగాటి పూలజడ, మెడలో రవ్వల నెక్లెస, కళ్ళకు తీర్చి దిద్దిన కాటుక, నీలివర్ణంతో గులాబిరాళ్ళు పొదిగిన ముక్కుపుడక పొంరాతి శరీర ఛాయ, కనుల కింపుగా వుంది ఆమె విగ్రహం. అలంకరణ పూర్తికాగానే సునంద లేచింది.

"కూర్చోవే తల్లీ బైటికెళ్తే దిష్టి తగులుతుందే' అంటూ బలవాతంగా కూర్చోబెట్టిందో ముత్తైదువ.

"అత్తా కాఫీ" అంది సునంద తప్పించుకునే నిమిత్తం.

"అబ్బ చంపుతున్నావే పిల్లా!" అంటూ ఆమె బైటికెళ్ళిపోయింది. సునంద లేచి దొడ్డిదారినటే శ్రీధర్ గది జేరింది.

గదితలుపులు తెరచి లోపలికి తొంగి చూసింది సునంద.

లోపల బావ కనుపించలేదు.

గది ఖాళీగావుంది, గది మధ్యగా ఒక కాగితంవుంది.

సునంద గుండెల్లో రైళ్ళు పరిగెత్తినట్లైంది. కాగితం అందుకొని మడత విప్పింది. అందులో.....

"బుజ్జీ,

అసమర్థుడినని నన్ను నిందించకు. బాగా ఆలోచించాను. నాగూర్చి ఆలోచిస్తే మావయ్య చెప్పింది నిజమనిపిస్తుంది. నేను వికలాంగుడిని, నాకు తెలుసు. నిన్ను ఏ విధంగా సుఖపెట లేను. నేనంటే నీకు గల ప్రేమా, అభిమానాన్ని తెలుసుకొని సంతోషంతో ఉప్పొంగి పోయాను. నిన్ను చూశాక నాబాధ అన్నీ మరిచి పోయాను.

నీసుఖం కోసం శాశ్వతంగా నీకు దూరంగా వెళ్ళిపోదామని వెళుతున్నాను. నందా, నేను నీ గూర్చి చిన్నప్పటినుండి ఏవో ఆలోచనలు పెట్టుకొని ఆశలు అంతస్తులు కట్టుకున్నాను. భగవంతుడు దయామయుడంటారు. నావిషయంలో మాత్రం ఆయన నిర్దయుడైయ్యాడు.

నందా నీ సుఖసంతోషాలకు మించి నేను కోరేది ఏది వుండదని నీవు గుర్తిస్తే చాలు. నీవు కలకాలం సుఖసంతోషాలతో జీవించాలని ఆశీర్వదిస్తూ ముగిస్తున్నాను.

నీ వివాహ శుభ సందర్భాన పెళ్ళికానుకగా నా ఆస్తి నీకు చెందాలని భగవంతుడిని ప్రార్థిస్తూ నాకేసు రద్దు చేసుకుంటున్నాను.

ఇట్లు
నీబావ
శ్రీధర్.

# వారఫలం

## 18-10-1968 శుక్రవారం మొదలు 24-10-1968 గురువారం వరకు

**మేషం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. పోటీవారితో మాట పట్టింపులు తగవు. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతిలభిస్తుంది.

**వృషభం :** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**మిధునం:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. నూతన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం :** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కన్య :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. ఉద్యోగంలో ప్రయాస కలుగుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అనుకూల వార్తలను వింటారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**తుల :** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృశ్చికం :** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. వారం ఆఖరులో అనుకోని చికాకులకు గురికాగలరు. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**ధనుస్సు** వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికివస్తుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి.

**మకరం :** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం** ఫలితం మాట యెలాగఉన్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం మధ్యలో ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మీనం :** వ్యాపారంలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. ఇతరుల మీద ఆధారపడి యేవ్యవహారమూ ప్రారంభించడం తగదు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వృత్తిలో శ్రమ కలుగుతుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

— మహేష్ ●

# సబ్బులన్నియు శుభ్రపరచును కాని...

ద్విగుణ చర్యగల
సింథాల్ సబ్బు
క్రిమినిరోధకం
మరియు శరీర
దుర్గంధ
నిర్మూలనం
కూడ!

## ...నిష్కళంకమైన చర్మసౌందర్యం నిమిత్తం
## జి-11తో గూడియున్న సింథాల్
## మీకు కావలెను.

సింథాల్ యందు గల జి-11 (హెక్సాక్లోరాఫీన్) చర్మ పొడలను గలిగించే హానికరమైన క్రిములను చంపుతుంది. ఆహ్లాదకరంగా పరిమళ మొనర్చబడినటువంటి జి-11 తోగూడియున్న సింథాల్ మీ చర్మమును మృదువుగాను, ప్రకాశమానంగాను వుంచుతుంది.




INTIRPUB GCS 9A-TEL

సీరియల్

# సుజాత

ఉన్నవ విజయలక్ష్మి

### జరిగిన కథ

సుజాత పుట్టగానే సూర్యం భార్య అన్నారు చెప్పినట్లు సుజాతకి సూర్యంపై అపేక్షలేదు. సూర్యానికి చదువు అబ్బకపోవడమూ, అతని ప్రవర్తనా సుజాత తల్లిదండ్రుల మనస్సును కూడా మార్చివేసింది. సుజాత అన్నపూర్ణా ఇంజినీరింగు వర్క్సులో టైపిస్టుగా చేరింది. ఆకంపెనీ యజమాని నీలకంఠం అతని కొడుకు శ్రీధర్. శ్రీధర్‌కి సుజాతపై అమితమైన ప్రేమ. సుజాత తల్లికి జబ్బుచేసినప్పుడు అతను ఎంతో సేవచేశాడు. సుజాతని పెళ్ళిచేసుకుంటానని ఆమె తల్లిపోయేముందు వాగ్దానంకూడా చేశాడు. సుజాత శ్రీధర్‌ల వివాహానికి మొదట్లో నీలకంఠం అంగీకరించక పోయినా తర్వాత సంతోషంగా ఆ తంతు జరిపించేశాడు.

## 10

గబగబ అడుగులు వేసుకుంటూ హడావిడిగా లోపలికి వచ్చిన శ్రీధర్ 'లైటు వేసుకోకపోయావా' అంటూ స్విచ్ వెయ్యడంతో గదంతా ఒక్కసారిగా వెలుగుతో నిండిపోయింది.

ఓచేతో దువ్వెన పెట్టుకుని సోఫాలో వాల్లి కూర్చుని ఆలోచనలలో మునిగిపోయి వున్న సుజాత వులిక్కిపడినట్లయి 'అబ్బా అప్పుడే రాత్రయిందా' అంది బయట ఆవరించుకున్న అంధకారాన్ని చూస్తూ.

కనుబొమలు ముడిచి వెక్కిరింతగా ఆమె కళ్లల్లోకి చూస్తూ, 'అయితే సు వ్విందులో కూర్చునే నిద్రపోయావా లేకపోతే కళ్ళు మూసుకుని తపస్సు చేస్తున్నావా—బాగా మబ్బు పట్టింది. అందుకే అలా వుంది. ఇంకా ఆరుకూడా కాలేదు' అన్నాడు కోటు విప్పి కుర్చీమీద పడేస్తూ.

'అంతేనా—పరధ్యానంతో లైటు గుర్తించలేదేమో ననుకున్నాను—ఇందాకా ఒక్క పదినిముషాల క్రితం ప్రకృతి ఎంత ఆహ్లాదకరంగా వుందని — అంతలో ఈ పాడు మేఘాలు వచ్చి దాన్నంతా పాడుచేశాయన్న మాట — సూర్యుడు అస్తమించకుండానే అంధకారం ఆవరించుకునేలా చేశాయి.' కావాలని ఏదో కల్పించుకుని మాట్లాడుతూ వెళ్ళి అతని చేతిలో టై అందుకుంది.

'నిజమే—యౌవ్వనం గడిచిపోకుండానే భయంకరమైన అనుభవాలు, కష్టాలు మనిషిలో వార్ధక్యాన్ని, వైరాగ్యాన్ని కలిగించినట్లు.' సరదాగా వేదాంతంలోకి దిగి నవ్వుతూ తల తిప్పిచూశాడు.

అప్పటికే ఆమె అధరాలమీది చిరునవ్వు మాయమయింది — కారుమేఘాలు ఆవరించిన ఆకాశంలా వున్న మొహాన్ని చటుక్కున వాల్చుకుని కోటు అందుకుని వెళ్ళిపోబోయింది కాని పొరపాటు గ్రహించుకున్న శ్రీధర్ చెయ్యిజాపి ఆమె భుజం అందుకుని దగ్గరగా తీసుకున్నాడు—జాలిగా ఆమె కళ్లల్లోకి చూస్తూ 'సారీ సుజా, నువ్వన్నదానికి హాస్యంగా జవాబు చెప్పానే కాని అందులో అర్థం అప్పుడు నాకు స్ఫురించలేదు.' అన్నాడు. తన మాటలు ఆమెకే అన్వయిస్తాయనే ఆలోచన అప్పుడు కలగనందుకు ఎంతగానో నొచ్చుకున్నాడు.

'అబ్బే—మీరు అన్నదానికి నేనేం బాధపడటం లేదు.' మిలమిల మెరుస్తున్న తడి కళ్లల్లోకి బలవంతాన చిరునవ్వు తెచ్చుకుంది. 'పిక్చర్‌కి వెళ్దాం అన్నారుగా' అతనిఅరచెయ్యి తనచెంప కానించుకుంటూ అడిగింది.

'అందుకేనా తలయినా దువ్వుకోకుండా అలా కూర్చున్నావు—ఆ చీకట్లో, అలా కుర్చీలో కూర్చున్న నిన్ను చూస్తే ఏమనిపించిందో తెలుసా...'

తెలియదన్నట్లు కళ్ళో తలా తిప్పేసింది.

'అయిదు దాటాక ఒక్క అరనిముషం కూడా ఆఫీసులో కూర్చోను అని మాట ఇచ్చికూడా త్వరగా రాలేదని అలిగి కూర్చున్నావేమోనని.'

'బాధ్యత ముందు—సరదాలు తరువాత అని నాకు తెలుసు.' షర్టు గుండీలు సవరిస్తూ అంది.

'మరయితే ఈ అవతారం ఏమిటి ?'

'తల కొస్త నొప్పిగా వుంది—జడ అల్లుకుందాం అనుకుంటూనే అలా కూర్చుండిపోయాను కళ్ళు మూసుకుని — ఇప్పుడు తగ్గిపోయింది—నిముషంలో తయారవుతా.'

కాస్సేపటి తరువాత ఇద్దరూ బయలుదేరారు. టిక్కెట్లు తీసుకుని లోపలికి వెళ్తూంటే 'హల్లో,' అంటూ ఓ వ్యక్తి చనువుగా శ్రీధర్ భుజం మీద చెయ్యి వేశాడు వెనకనుంచి.

శ్రీధర్ తిరిగి చూసి 'సుహ్హా ఎప్పు డొచ్చావు — నా మిసెస్‌ని పరిచయం చేస్తాను,' అని ముందు వెళ్తున్న సుజాతతో, ఇతను రాజారావని...'

ఆ తరువాతిమాటలు సుజాతకి వినిపించలేదు; తన కాళ్ళక్రింద భూమి పగిలిపోయి తను ఆ అఘాతంలోకి చొచ్చుకు పోతున్నట్లు భయవిహ్వల అయిపోయింది — ఏ క్షణంలో తెలివితప్పి పడిపోతానో అన్న భయంతో తనని తను నిలదొక్కుకునే ప్రయత్నంతో ప్రక్కనున్న రేలింగు గట్టిగా

పట్టుకుకుంది వో చేత్తో. వెనక్కి తిరిగి అతన్ని చూసే సాహసం చెయ్యలేక పోయింది — కాని ఈలోగా అతనే చటుక్కున ముందుకు వచ్చి—

'నమస్తే' అనటంతో తప్పని సరిగా తల ఎత్తవలసి వచ్చింది ఊపిరి బిగ పట్టుకుని.

'నమస్తే,' రెండు చేతులూ జోడించి మంద్ర స్వరంతో పలికింది — ముంచుకు రాబోయిన ప్రళయం తప్పిపోయిందనిపించినా క్షణం క్రితం తనని వివశురాలిని చేసిన మనస్థితి నుండి ఇంకా కోలుకోలేక పోయింది.

'అలా వున్నావేం?' తెల్లగా పాలి పోయిన ఆమె మొహంలోకి ఆత్రంగా చూస్తూ అడిగాడు శ్రీధర్.

'ఏమిటో కళ్ళు తిరిగినట్లయింది.'

'ఇందాకనే తల నొప్పి అన్నావు — అంత ఎక్కువగా ఉంటే చెప్పకపోయావా— తగ్గిపోయిందనుకున్నాను —' వెళ్లిపోదాం పద.' ఆమె ఒక్కతే అలా నిలబడలేదేమో నన్న భయంలో ఆసరాగా భుజం మీద చెయ్యివేసి స్నేహితుడితో ఏదో చెప్ప బోయాడు. సిగ్గుపడుతూ అతని చెయ్యి తీసేసి—

'అబ్బే. ఏం ఫరవాలేదు. పిక్చరు చూద్దాం.' అంటూ తనే ముందు దారి తీసింది.

సీట్లలో కూర్చున్నాక, 'ఏం మరీ అంత అపురూపంగా చూసుకుంటున్నావు—ఒట్టి తల నొప్పేనా లేకపోతే ఆ కళ్ళు తిరగ టానికి మరో కారణం కూడ వుందా.' స్నేహితుడి చెయ్యి నొక్కి కళ్ళతోనే నవ్వాడు రాజారావు.

'నో. నో. అదేం లేదు — మా పెళ్ళయి పదిహేనురోజులే అయింది — వో రెండేళ్ళు హాయిగా ఏ చీకూ చింతా లేకుండా తిరుగుతాం. ఎవ్విరిథింగ్ బై ప్లాన్.' అని నవ్వి, 'సరే ఇప్పుడు నీ గురించి చెప్పు — పరీక్షలయిపోయాక మీ వూరు వెళ్లిపోయావు — ఆ తరువాత ఇప్పుడు ఇలా కలుసుకోటమే,' అన్నాడు.

'బెంగుళూరులో కిర్లోస్కర్సులో ఉద్యోగం దొరికింది — ఆఫీసు పనిమీద వచ్చానిపుడు—రేపయినా నీకు ఫోను చెయ్యా లనుకుంటున్నాను...'

'కొయ్యకు మరి — నేను కనిపించాను కనక ఆ మాట అంటున్నావు పాపం...'

'నిజంగానే— నువ్వంటే ఇన్విటేషన యినా పంపకుండా పెళ్ళి చేసేసుకున్నావు కాని వూళ్ళోకి వచ్చి నిన్ను కలవకుండా వెడతానా.'

తన విసురు తనకే తగలడంతో 'నువ్వు బెంగుళూరులో వున్నావని నాకు కల వస్తుందా. ఉద్యోగం రాగానే వో వుత్తరం అయినా రాశావుకాదు మరి.'

'ఊహూ—' అని 'మీరిద్దరూ [illegible] మా వూరు రండి' అన్నాడు.

'రావాలి—ఇప్పుడు పని కొంచెం ఎక్కువగా వుంది నాన్నగారు ఒక్కరూ చూసుకో లేరని మానేశాం — సమ్మర్‌లో అయితే ఊటీలో కూడా కొన్నాళ్ళు స్పెండ్‌చేసి రావచ్చు' అన్నాడు తెరవంక చూస్తూ.

ఆ స్నేహితు లిద్దరూ చెప్పుకుంటున్న ఖబుర్లు సుజాత చెవులు వినటంలేదు— తెరమీది దృశ్యాన్ని కళ్ళు చూడటం



లేదు— ప్రకృతాన్ని విస్మరించి ఆమె మనస్సు గతంలోకి చొచ్చుకుపోయింది ...

బి. ఏ. ఫైనలియర్‌లో రాజారావు పబ్లిక్ ఫైనాన్సు చెప్పేవాడు. అతను ఆ సంవత్సరమే కొత్తగా వచ్చాడు. చాలా తెలివైనవాడనీ, పై అధికారయినా మాట అంటే పడనీ అందుకే అదివరకటి ప్రిన్సిపాల్‌తో పోట్లాడి అక్కడి ఉద్యోగానికి రాజీనామా యిచ్చేశాడనీ అతని మామగారికి కాస్త పలుకుబడి వుండటంవల్ల వెంటనే ఇక్కడే ఉద్యోగం దొరికిందనీ రోజుకో సమాచారం పట్టుకొచ్చి క్లాసులో లెక్చరర్ లేనప్పుడు చెప్తూండేవారు స్టూడెంట్సు. సహజంగా కొత్తగా వచ్చినవాళ్లంటే వుండే కుతూహలంతో అతను క్లాసు తీసుకున్న మొదటిరోజే సుజాత చాలా తెలివైన అమ్మాయి అని గ్రహించేశాడు. ఆమెలోని చురుకుదనం చదువుపట్ల ఆమెకి గల ఆసక్తి అతన్ని ముగ్ధుడ్ని చేసేవి. ఆ అమ్మాయంటే ప్రత్యేకమయిన అభిమానం కలగసాగింది.

ఓ రోజున రమ అంది. రాజారావుగారు ప్రతి పేపర్లోనూ ఫస్టు మార్కు నీకే ఇస్తాడు.' అని. ఆమె మాటల్లో రవంత అసూయ తొంగి చూసినా లెఖ్ఖ చెయ్యకుండా —

'నాకే ఇవ్వటం ఏమి? మనం వ్రాసిన దాన్ని బట్టి ఇస్తాడు.' అని సమాధానం చెప్పింది సుజాత, కించిత్ గర్వం కూడ ధ్వనించింది ఆమె మాటల్లో.

## సుజాత

'ఏమో మరి. మేం ఎంత కష్టపడి చదివి ఎంత బాగా వ్రాసినా మా మొహాన అత్తెసరు మార్కులే. క్లాసంతటికీ నువ్వొక్కదానివే ఫస్టుక్లాసు స్టూడెంటు వనుకుంటున్నాడేమో,' కడుపులో మంట వెళ్లగక్కింది రమ.

'బాగుందమ్మా — ఇంచుమించు మన బేచంతా ఫస్టుక్లాసు స్టూడెంట్సే—ఏదో అలా కలిసి వచ్చి ఈ మూడుసార్లు నాకు ఫస్టు మార్కులు వచ్చాయి కాని ఆ సుందర్రావు పాండురంగం వాళ్లక్కూడా మంచి మార్కులే వచ్చాయని తెలిసిందిగా.' రమ ఆరోపణకి కాస్త చిరాకు కలిగినా మర్యాదగానే సమాధానం ఇచ్చింది సుజాత.

మరోరోజు—క్లాసులో పాఠం చెప్పటం అయిపోయింది. పుస్తకం మూసి చేతివాచీ కేసి చూసుకుంటున్నాడు రాజారావు — వాచీలు వున్న విద్యార్థులంతా అప్రయత్నంగా తలలు వంచి టైము చూసుకున్నారు. ఇంకా ఐదునిమిషాలుంది.

'డౌట్సేమయినా వున్నాయా అని నిన్ను అడుగుతాడు చూస్తూండు.' అంది రమ సుజాతని మోచేత్తో పొడిచి.

'నన్నడిగితే నిన్ను చూపిస్తానులే,' తల వంచుకుని నోట్సు వ్రాసుకుంటూ అంది సుజాత.

సుజాత వ్రాసుకోటం అయి పుస్తకం మూసి తల ఎత్తగానే అంతవరకూ ఆమె




చూస్తున్న రాజారావు 'ఏని డౌట్స్' అని చప్పున చూపులు తిప్పుకుని క్లాసంతా కలియ జూశాడు ఆ ప్రశ్న ఆమె ఒక్కదాన్నే ఉద్దేశించినట్లుగా వుండకుండా. రమ సుజాత వంక క్రీగంట చూసి నవ్వింది.

సుజాత ఏదో అనబోతుంటే ఒక విద్యార్థి లేచి ఏదో అడగటం, రాజారావు దాన్ని మరోసారి చెప్పటం అది ముగిసే సరికి గంట కొట్టటం జరిగిపోయాయి.

'నేను చెప్పలేదూ' అంది రమ, ఉడుకుమోత్తనంగా, క్లాసులోంచి బయటికి వస్తూ.

'అబ్బ ఏమిటిదీ ఆయన అందర్నీ ఉద్దేశించి అడిగాడు' అంది సుజాత చిరాకు తెచ్చుకుంటూ. ఇద్దరూ ఇంటిముఖం పట్టారు.

'ఏం కాదులే. ఎన్నయినా చెప్పు నువ్వు ఫేవరిట్ స్టూడెంటువి'

'అయితే కావచ్చు. వాళ్ల సబ్జక్టులో ఇంటరెస్టు చూపించేవాళ్లంటే లెక్చరర్లకి అభిమానం వుండటం సహజమే — మరి లాస్టియరుదాకా నువ్వు ఆ నారాయణరావు తెలుగు లెక్చరర్‌గారి ఫేవరిట్ స్టూడెంట్వి కాదేమిటి' సుజాత నిర్మొహమాటంగా చెప్పటంతో రమ నోరు కట్టుబడి పోయింది—

పరీక్షలింకా రెండు నెలలుకూడా లేవు. ఆడుతూ పాడుతూ తిరిగిన విద్యార్థులుకూడ శ్రద్ధగా పుస్తకాలు ముందు వేసుకుని బుద్ధిగా చదువుకోడం మొదలుపెట్టారు.

కాలేజీ నుండి వస్తూనే తల నొప్పి అని పడక వేసిన సుజాతకి మరి కాస్సేపటికే జ్వరం కూడ వచ్చింది.

'పరీక్షలు దగ్గిరికి వచ్చాయి. పాఠాలు పోతాయి. ఎలాగో వెళ్ళి వచ్చేస్తాను.' అంటూ మర్నాడు మామూలుగానే తయారయింది ఓపిక లేకపోయినా—

'నీకేం మతిలేదా ఏమిటి? లంఖణంతో కాలేజీకి వెళ్తానంటావు—ఈ రోజుకి రెస్టు తీసుకో రేపటికి జ్వరం తగ్గిపోతోంది,' అని మందలించారు తల్లీ తండ్రీ.

కాని ఆరేపు రావటానికి పది హేను రోజులు పట్టింది. ఆ తరువాత మరో రెండు రోజులకి పథ్యం పెట్టారు. ఆ తరువాత మరో పది రోజుల దాకా సుజాత

కాలేజీ మొహం చూడలేక పోయింది.

ఆమెకి భోరున ఏడవాలనిపించింది — పరీక్షల ముందు. ఇంచుమించు నెలరోజులు పాఠాలు పోయాయి—ఫస్టుక్లాసువస్తుందని ఎక్కువెక్కువ చేస్తోంది. ఇంక క్లాసేమిటి అసలు పాసవుతానా అన్న భయం పట్టుకుంది ఇప్పుడు.

కాలేజీకి వెళ్ళగానే—

'అబ్బ ఎంత చిక్కి పోయావు—మరో వారం రెస్టు తీసుకోకుండా అప్పుడే ఎందుకు వచ్చావు—ఈ మార్చికి పరీక్షకి వెళ్తావా—నీకేంలే చదవక పోయినా ప్యాసవుతావు.' లాంటి మాటలతో పలకరించారు అందరూ.

'చాలా పాఠాలు అయిపోయాయి కదూ—కాస్త నీ నోట్సులియ్యి, వ్రాసుకుని ఇచ్చేస్తాను—అన్నీ. ఒక్కసారి వద్దులే నువ్వు చదువుకోవాలిగా, రోజు కొకటి ఇస్తూండు.' అంది రమతో క్లాసులో.

రమ డస్కులోంచి రెండు నోట్సులు తీసి ఇచ్చింది. సుజాత వాటిని తిరగేస్తుంటే రమ ధోరణి సాగిపోయింది.

'మరేం—రాజారావుగారు అసలు రెండు మూడు రోజులు కొత్త పాఠం చెప్పనే లేదు — లెటస్ రివైజు అంటూ పాత పాఠాలే వెనక్కీ ముందుకీ చెప్పుకుంటూ పోయాడు—నువ్వు అప్పుడప్పుడే రావని తెలిశాక అప్పుడు కొత్త పాఠాలు చెప్పాడు పాపం విధిలేక.'

'నువ్వు నోరు మూసుకుంటావా ముందు,' అంటూ రమ వంక చురచుర చూసిందే కాని సుజాత అంతరంగం మాత్రం అతనికి తనయందు గల ప్రత్యేకమయిన అభిమానానికి పొంగి పోయింది.

మరో పదిహేను రోజులు గడిచిపోయాయి. అందరూ కోర్సులు ముగించి శలవ లిచ్చేశారు పరీక్షలకి ప్రిపేర కావటానికి—పగలంతాచదివి రాత్రి సుఖంగా నిద్రపోయేవాళ్ళు, టీ తాగి రాత్రంతా మేలుకుని చదివి పగలు నిద్రపోయే వాళ్ళు, విద్యార్థులలో రకరకాలున్నా అందరి ధ్యేయం ఒక్కటే.

ఓ సాయంకాలం నోటుబుక్కూ పెన్నూ తీసుకుని రమా వాళ్ళింటికి వెళ్ళింది సుజాత, 'రాజారావు మాష్టారింటికి వెళ్దాం వస్తావా, రెండుమూడు రోజులు, రోజుకో గంట చెప్పించుకున్నా చాలు మిస్సయిన లెసన్సన్నీ మేకప్ చేసుకోవచ్చు' అంటూ.

'నా నోట్సులన్నీ వ్రాసుకున్నావుగా — ఇంకా అర్థం కానివి వుండిపోయాయా నీక్కూడ' అంది రమ.

సుజాతకి కాస్త చిరాకనిపించినా పైకి కనుపించనీయకుండా 'ఎంతయినా నెల రోజులు పోయిన పాఠాలు నోట్సులు చదివి మేకప్ చేసుకోటం కష్టంకదా — మనం అంటే ఆయన కాస్త శ్రద్ధగా చెప్తారు. అన్నీ ఓసారి చెప్పించుకుంటే బాగుంటుందని— క్లాసు వస్తుందనే ఆశ ఎప్పుడో పోయింది. ఏదో ప్యాసయినా అనిపించు

ఉందామని' అంది.

'ఎన్నిసార్లు చెప్పించుకున్నా నాకు బొటాబొటి మార్కులే వస్తాయిలే - అయినా రావటానికి నాకేం అభ్యంతరంలేదు — రేపు వెళ్దాంలే. ఇవాళ తలంతా దిమ్ముగా వుంది ఇప్పుడేం చెప్పించుకున్నా అర్థం కాదు' అంది రమ.

మర్నాడు ఎండ చల్లబడ్డాక పుస్తకాలు తీసుకుని రమా వాళ్ళింటికి వెళ్ళింది— వీధి గదిలో రమ తమ్ముళ్ళు చెల్లెలు చదువుకుంటున్నారు. 'ఇంక పుస్తకాలు దాచేసి ఆడుకోటానికి వెళ్ళిపోదాం' అంటూ గుసగుసలుపోతూ, కూర్చునే తలయెత్తి కిటికీలోంచి బయటి ఎండని చూస్తున్న వాళ్ళని చూసి నవ్వుకుంటూ లోపలికి వెళ్ళింది సుజాత. అక్కడి దృశ్యం చూస్తూనే నిలువునా నీళ్ళు కారిపోయింది.

రమ మంచంమీద పడుకుని మూలుగుతోంది — వాళ్ళమ్మగారు ప్రక్కనే కూర్చుని నుదిటిమీద తడిగుడ్డ వేస్తోంది.

'జ్వరం వచ్చిందా' అంది రెండడుగులు ముందుకువేస్తూ.

వాళ్ళమ్మగారు తలయెత్తి చూసి, 'నువ్వా, రా. నిన్నటినుంచి ఒకటే తలనొప్పి వాంతులు— ఏం చదువులో— అర్థరాత్రిదాకా మేలుకుని చదవటం ఆపైన పైత్యం చేస్తే యిలా అవస్థపడటం' అని ఆవిడంటూంటే—

'ఈ తలనొప్పి రాదలచి వచ్చిందే కాని నేనెప్పుడూ అర్థరాత్రిదాకా మేలుకుని చదవలేదు' అంది రమ మూలుగుతూనే. ఆ పిల్ల రాత్రి రెండుగంటలదాకా చదివినా 'అబ్బ నేనసలు నిద్రకి ఆగలేను. పరీక్ష రోజులయినా సరే పదిగంటలయినా కాకుండా పడుకుంటాను. అందుకే మార్కులింత లక్షణంగా వస్తున్నాయి' అని ఖబుర్లు చెప్పేది స్నేహితులతో. అసలు సంగతి ఏదోవిధంగా బయటపడిపోతూనే వుండేది. అప్పటికీ ఆ పిల్ల డబాయించటం మానదు.

సుజాత నవ్వాపుకుంటూ వెళ్ళి మంచం పట్టె మీద కూర్చుని రమ వంటిమీద చెయ్యివేసి చూసింది. 'జ్వరం లేదులే. ఈ తలనొప్పే ప్రాణాలు తీసేస్తోంది. పొంతి గంధం పట్టు వేసుకోటంతోసహా అన్ని వైద్యాలు అయిపోయాయి. రేపటికయినా తగ్గితే బాగుండును' అంది కణతలు నొక్కుకుంటూ.

'సరే నే వెళ్తాను. కళ్ళుమూసుకు పడుకో అదే సర్దుకుంటుంది. రెండు రోజులు ఏం చదవకు' అంది సుజాత లేస్తూ.

'నువ్వెళ్ళి చెప్పించుకో—నన్ను నమ్ముకుంటే నీకు వచ్చే మార్కులూ పోతాయి' అంది రమకూడ లేచి కూర్చుని.

'అబ్బే యింటికే వెళ్ళిపోతాను — ఇద్దరం కలిసి సరదాగా వెళ్దాం అనుకున్నాను— ఇప్పటిదాకా వచ్చింది చాల్లే.'

'అయితే తొందరేమిటి వో నిముషం కూర్చో' అని రమా వాళ్ళమ్మగారు ఇంట్లోకి వెళ్ళి కాఫీ పట్టుకు వచ్చి ఇచ్చింది. అది త్రాగి కాస్సేపు కూర్చుని ఖబుర్లు చెప్పి లేచింది సుజాత.

రోడ్డు మీద నడుస్తూంటే సుజాత మనస్సు రమ అన్న మాటలని గురించే ఆలోచిస్తోంది.

'తన కన్నా నాకు మంచి మార్కులు వస్తాయని కాస్త అసూయ వుంది. హైస్కూల్లో చదువుకుంటున్నప్పటి నుంచీ తన ధోరణి అంతే. నేను ఫస్టు రేంకులో ప్యాసవుతానని లెక్చరర్లు అంటూంటే తన మనస్సు వుడికి పోతూండేది. అలా ఏడ్చుకునే వాళ్ళ అందరి దిష్టి తగిలే నెలరోజులు మంచం ఎక్కి చదువూ గిదువూ లేకుండా అయింది. ఫస్టుక్లాసు వస్తుందనే ఆశ పోయినా ఏదో తంటాలు పడదామని నా ఇది — ఒక్కోసారి ఇలా లాస్టుమినిట్‌లో చెప్పించుకున్నవే పరీక్షలో వచ్చి ఎంతో బాగా వ్రాయ గలుగుతాం. తను రాకపోతే మాత్రం నేనొక్కదాన్ని వెళ్ళి చెప్పించుకుంటే ఏం.'— ఓ నిశ్చయానికి వచ్చి రిక్షా ఎక్కి కూర్చుంది.

ఓసారి రమా సుజాత మ్యాటినీ నుంచి వస్తుంటే రాజారావు, భార్య కనిపించారు. 'మా ఇల్లు దగ్గరే.' అంటూ ఆ ఇద్దర్నీ యింటికి తీసుకువెళ్ళి కాఫీ అదీ యిచ్చి మర్యాద చేశారు.

'ఫరవాలేదు. ఇల్లు గుర్తు పట్టగలను' అనుకుంటూ సినీమా హాలు ప్రక్క సందులోకి తీసుకు వెళ్ళమంది రిక్షాని...

— సుజాత ఒళ్ళు గగుర్పొడిచింది భయంతో. తన చేతిలో వున్న ఆమె చేయి జలదరించటం స్పష్టంగా తెలియటం వల్ల, 'భయం వేస్తోందా — చాలా థ్రిల్లింగ్‌గా వుంది.' అన్నాడు శ్రీధర్. ఆ థ్రిల్ ఏమిటో తను అసలు చూడలేదు. తరువాత అడిగితే చెప్పటానికయినా కాస్త చూడాలి అనుకుని సర్దుకుని కూర్చుని దృష్టి నిలుపుకోటానికి ప్రయత్నించింది.

సినీమా అయి బయటికి వచ్చేసరికి నక్షత్రాలు కనిపించకుండా మేఘాలు అల్లుకు పోయాయి. కళ్ళు మిరిమిట్లు గొలిపేలా వుండి వుండి మెరుపులు, చెవులు అదిరిపోయేలా వురుములు—

'బాగా వాన వచ్చేలా వుంది,' అన్నాడు రాజారావు.

'ఆఁ ఏమో— సాయంకాలం ఇంతకన్నా హడవిడిచేసి తేలిపోయిందిగా.' కారు తాళం తీస్తూ అన్నాడు శ్రీధర్.

రాజారావుని తాజ్‌మహల్ దగ్గర దింపి ఇంటికి వెళ్ళేసరికి సన్నగా తుంపర ప్రారంభమయింది.

భోజనాలు ముగించి పడకలు చేరేసరికి, దడదడ శబ్దం చేసుకుంటూ పై డాబా మీద నుంచి నీరు గొట్టాలలోంచి క్రిందికి పడుతోంది—హోరున కురుస్తున్న వాన అంతకంతకీ ఎక్కువవుతున్నట్లే వుంది— రాత్రిళ్ళు అలా నిలిచి వానపడుతూంటే సుజాతకెంతో ఇష్టం — ఆ చప్పుడు జోల పాడినట్లు అలా చెవులకి విని పిస్తూంటే కళ్ళు మూసుకుని పడుకోటం ఆమెకెంతో సరదా. కాని, ఇవాళ ఆమె మనస్సు ఆ అనుభూతిని అందుకునే స్థితిలో లేదు — కళ్ళు మూసినా తెరిచినా భయంకరమైన నీడలు కళ్ళముందు కదులుతున్నట్లే వుంది. పిశాచాలు వికటాట్టహాసం చేస్తూ తనచుట్టూ, గెంతులేస్తున్నంత భీతి గొలుపుతోంది—ఎంత భయం అనిపించినా బాధ అనిపించినా అది ఒకరితో చెప్పుకో గలిగేది కాదు. మౌనంగా గుండెల్లో దాచుకుని భరించాల్సిందే...'

'ఓ సారే మయిందంటే...' ఎప్పటిదో ఓ సంఘటన గుర్తువచ్చి వుత్సాహంగా మొదలు పెట్టారు శ్రీధర్.

— అటు తిరిగి పడుకున్న సుజాత బాధగా

రాబోతున్న నిట్టూర్పుని బలవంతాన అణచుకుని కళ్ళు మూసేసుకుంది — ఆమె దగ్గరనుండి సమాధానం రాకపోవటంతో 'నిద్రపోయావా ?' అని తనూ కళ్ళుమూసుకు పడుకున్నాడు.

అర్ధరాత్రి దాటింది—కెవ్వుమన్నకేకతో తృళ్ళిపడి మేల్కొన్నా డతను. 'ఏమయింది పీడకల వచ్చిందా — చూడు మెళుకువ తెచ్చుకో.' భుజం పట్టుకుని కుదుపుతూ అనునయంగా అంటున్నాడు.

'కలవరించానా.' కలత నిద్దరలో పైకే ఏమయినా అనేశానేమో నని భయపడుతూ అడిగింది.

'కలవరింతా—లబ్బ, ఎలా వులిక్కిపడ్డానని—పిల్లినోట చిక్కిన కోడిపిల్ల ప్రాణంకోసం పెనుగులాడుతూ చేసే ఆర్తనాదంలా కీచుమన్నావు—ఎందుకంత భయపడ్డావు—' మీద చెయ్యివేసి దగ్గరగా తీసుకున్నాడు ఇంక భయంలేదు పడుకో అంటూ.

* * *

మధ్యాహ్నం గడిచి సాయంకాలం పరుచుకుంటోంది. వాలుగా వచ్చిన సూర్యకిరణాలు సూటిగా కిటికీమీద పడుతున్నాయి. ఎండపొడ లోపలికి రాకుండా కర్టెన్ సరిచెయ్యాలని వెళ్ళింది సుజాత—కిటికీలోనుంచి కనిపిస్తున్న దృశ్యాన్ని చూస్తూ వచ్చిన పని మరిచిపోయి అలాగే నిలబడిపోయింది.

క్రింద ఎవరితోనో మాట్లాడుతున్న శ్రీధర్ వాళ్ళని పంపించి పైకి వచ్చిన సంగతి కూడ ఆమె గమనించలేదు— లేత ఎండ ఆమె నున్నటి బుగ్గలమీద పడుతోంటే, చెక్కిన శిల్పంలా ఎటో చూస్తూ నిలబడిన భార్య సౌందర్యానికి ముగ్ధుడై దగ్గరగా వస్తూ 'అంతగా ఆకర్షించి నిన్ను ఆకట్టేసుకున్న దృశ్యం ఏముందక్కడ' అన్నాడు. అతని మాటలు ఆమె చెవికి ఎక్కలేదు కాని దగ్గరగా తగిలిన స్పర్శతో వులిక్కిపడినట్లయి 'పాప' అంది పరధ్యానంగా.

మధురంగా నవ్వాడు శ్రీధర్. 'ప్రజలూ ప్రభుత్వమూ పరిమిత కుటుంబమో అని గోల పెడుతూంటే నువ్వు ఇప్పట్నించీ పాపని గురించే ఆలోచిస్తున్నావా.'

అతను చెప్తున్నది అర్థం కానట్లు చూసింది. 'ఏం కోపం వచ్చిందా' కనుబొమలు ముడిచి వెక్కిరింపుగా అడిగాడు

'బాగుంది — ఆ వెళ్తున్న పాపని చూడండి, చక్కగా వుంది కదూ అని నేను చెప్తూంటే...'

ఆమె చూపించినవైపు దృష్టి తిప్పాడు శ్రీధర్ — వో చిన్నపాప ఎవరిదో చెయ్యి పుచ్చుకుని బొమ్మలా నడిచి వెళ్తోంది— మూడేళ్ళుంటాయేమో — పొట్టిగౌను, బుల్లి జడలు — వో జడలో ఎర్రటి గులాబీ — తల ఎత్తి ప్రక్క అతనితో ఏమిటో చెప్పేస్తోంది — చెయ్యి జాపి దేన్నో చూపిస్తోంది — అతను, ఆ పాప తండ్రే అయివుంటాడు, ఒక క్షణం ఆగి పాపకి ఏమిటో చెప్పి మళ్ళీ నడిపించుకుని తీసుకు వెళ్తున్నాడు — శ్రీధర్ కూడ ముచ్చటగా చూస్తూండి పోయాడు, అంతకంతకీ దూరం అయిపోతున్న ఆ పాపని—

'మన ఇంటి ముందు నుంచి వెళ్తున్నప్పుడు చూశాను — చక్కటి మొహం, కళ్ళకి కాటుక పొడుగుబొట్టు, చెవులకి రింగులూ...'

'కొన్నాళ్ళు పోయాక మనకీ అలాంటి పాప వుంటుంది. నువ్వు అంతకన్న అందంగా ముస్తాబు చేద్దువుగాని.' అన్నాడు శ్రీధర్ మధ్యలోనే అందుకుని.

సుజాత అలాగే చూస్తూ నిలబడిపోయింది మౌనంగా.

'ఇంకా మీ పాప వెళ్ళలేదా—ఇక్కడ మీ శ్రీనారి కడుపులో ఎలకలు పరుగు పెడుతున్నాయి.' బట్టలు మార్చుకోటం అయి బాత్‌రూమ్ వేపు వెళ్తూ నవ్వుతూ అన్నాడు.

చమర్చిన కళ్ళను అతను చూడకుండా అద్దుకుని గబగబ క్రిందకి వెళ్ళిపోయింది సుజాత.

(ఇంకా ఉంది)

బోడి సెలెక్షను చేశారూను- నాకు చీర కొనాలనుకున్నప్పుడు నాతో చెప్పకూడదూ?



# ఇలా జరుగుతుందనుకోలేదు

రమణి

"సుబ్బారావు చచ్చిపోయాడట..!"

"[illegible]...!"

'ఎంత వినయవిధేయతలతో ఉండేవాడు?"

"అంత శ్రద్ధగా చదివే పిల్లాడ్ని నా అనుభవంలో ఇల్లా చూళ్లేదు.."

"ఎంత మంచి పిల్లాడు?"

"ఒకరి జోలికి పోయేవాడు కాదు.. అతని మీద ఎవరూ పితూరీలు చెప్పినట్టు కూడా కనిపించదు. కుర్రాళ్లందరితోను కలిసికట్టుగా వుండేవాడు. ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ సరదాగా తిరిగేవాడు.."

"అతను లేకపోయినా.. మన మనస్సుల్లో నుంచి అతని ముద్ర చెరిగిపోయేది కాదు."

"మన పాఠశాల దురదృష్టవశాత్తూ ఒక తెలివైన కుర్రాడికి దూరమైపోయింది."

పిల్లలందరూ సమావేశమైన 'ప్రార్థన' సమావేశ సమయంలో ఉపాధ్యాయులందరూ సుబ్బారావు పైన గల వారి వారి అభిప్రాయాలని సెలవిచ్చారు.

ఆరోజు సెలవివ్వలేదుగాని, రెండు పీరియడ్లు కేన్సిలవుతూ పాఠశాల కార్యక్రమం మొదలైంది.



సుబ్బారావు క్లాసు వాళ్లకి తప్ప, తతిమా క్లాసు వాళ్లకే అతని గురించి తెలియదు! టీచర్ల సానుభూతి సంతాప విశేషాలతో మొత్తం స్కూల్లో పిల్లలందరికీ సుబ్బారావంటే ఎవరో, అతనెంత తెలివైనవాడో, ఎంత మంచివాడో అర్థమయింది!

మామూలుగానే సుబ్బారావు చచ్చిపోయాడని పిల్లలకి తెలిస్తే అంత బాధ పడేవారు కాదేమో! ప్రత్యేకంగా అతన్ని గురించి గౌరవనీయులైన ఉపాధ్యాయులంతా పొగడ్డంతో పిల్లలందరిలోనూ సుబ్బారావును పోగొట్టుకున్న లోటు తెలియవచ్చింది. అతన్ని కనీసం కంటితో చూడని వాళ్లు కూడా ఎంతో దిగులుపడి పోయారు.

సుబ్బారావు—రాజా క్లాసులో వాడుకాదు. అయినా, అతని గురించి తెలియకపోలేదు.

టీచర్లందరూ అతన్ని గురించి అంతగా పొగిడేస్తుంటే రాజాకు చాలా ఆశ్చర్య మనిపించింది.

సుబ్బారావు మాసర్లంతా చెప్పినంతటి తెలివైన వాడుకాదు. ఒకటి, రెండుసార్లు అల్లరి చెయ్యగా దండించినట్లు కూడా లీలగా జ్ఞాపకం వచ్చింది రాజాకు.

రాజా, సుబ్బారావు గురించి ఆలోచిస్తున్నపుడు అనుకోకుండా అతని పెదాలు నవ్వుతో విచ్చుకొన్నాయి.

అంతలోనే ఒక విధమైన వైరాగ్యం అతన్నావహించింది.

'చావు చాలా గొప్పది..' అనుకున్నాడు లోలోన.

'బ్రతికున్నప్పటి కంటే చచ్చిపోయినప్పుడే అతని గుణగణాలు వెలికి వస్తాయి—'అనుకున్నాడు.

చచ్చిపోయిన మనిషి గురించి చెప్పుకునే మంచిలో చాలా ఆనంద ముంటుంది!

ఆ అనుభూతిని తను కూడా ఆనందించగల్గితే? చచ్చిపోకుండా అలాటి సానుభూతి లభించదు. చచ్చిపోతే ఆ అనుభూతి ఆనందించడం జరగదు. ఎలా??

చేతిలో సిగరెటు చివరి కంటూ కాలి వేళ్లని ముద్దు పెట్టుకోవడమూ—సచ్చిదానందం మాసారు ఉస్సురుమంటూ రాజా ఎదురుగా కూర్చోవడమూ ఒకేసారి జరిగాయి.

సచ్చిదానందం చాలా విచిత్రమైన మనిషి. ఎంత గడ్డు లెక్కలయినా అతనికి కరతలామలకం. ఇంగ్లీషులో పారంగతుడు. తెలుగులో దిట్ట. ఈ మూడూ అతనిలో ఎలా ఇమిడాయో— ఆచార వ్యవహారాలూ అంతే!

ఆయన హోటల్లో భోజనం చెయ్యడు. సొంతంగా మడి కట్టుకుని వండుకుంటేనే గాని 'అన్నం' అనే పదార్థాన్ని ముట్టడు. హోటల్లో ఇడ్లీల దగ్గర్నుంచి అన్ని చిరుతిళ్లనీ ఆరగించేస్తుంటాడు. ఇడ్లీ 'వరి' బియ్యంతో తయారు కాలా? దాన్ని మాత్రం మడితో వండారా హోటల్‌వాళ్లు? అని అడగ్గల శక్తి రాజాకు వుండేదికాదు. సచ్చిదానందంపై రాజా కుండే పూజ్యభావం అలాంటిది.

సచ్చిదానందం, రోజూ గాయత్రీ జపం చేస్తూండేవాడు. ఏ ఆడవాళ్లూ నోయని నోములూ, చెయ్యని వ్రతాలు చేస్తూండేవాడు. సెలవులు ప్రత్యేకంగా వాటి కోసం వాడుకుంటూంటాడు.

సుమారు నలభై యేళ్లున్నా కుర్రాళ్లలో కుర్రాడుగా—పెద్దాళ్లలో పెద్దోడుగా కలిసిపోతూ వుంటాడు. అయితే పాతికేళ్లయినా నిండని రాజా అతన్ని భక్తి భావంతోనూ— గౌరవభావంతోనూ చూస్తూంటాడు.

సచ్చిదానందం రాజా కెదురుగా కూర్చుంటూ...

"నాకు చచ్చిపోవాలని వుందోయ్....." అన్నాడు.

రాజా అదిరిపడ్డాడు. ఆ ఆలోచన తనకి ఒక్కడికే వచ్చింది అనుకుంటున్నాడింతవరకూ. సచ్చిదానందానికి కూడా వచ్చిందంటే పెద్ద విశేషమే.....!

"ఏమిటలా అంటున్నారు!"

"కాదు మరీ... చచ్చి పోయిన తర్వాత ఆ మనిషి గురించి చెప్పుకునే మాటలున్నాయ్ చూశావూ... అవి భలే థ్రిల్లింగ్‌గా వుంటాయ్....ఏమంటావ్?"

"నేనూ అదే ఆలోచిస్తున్నాను."

"చంపావ్..... ఫో ...మనిద్దరికీ ఒకేసారి ఒకే అయిడియా రావడం విచిత్రంగా లేదూ...."

"ఒకేసారి రావడంలో విచిత్రం లేదు. ఎందుకంటావా? సుబ్బారావు గురించి మనం ఇప్పుడే విన్నాం. అతని గుణగణాలు మనకు తెలును. అతను పోయిన తర్వాత అతన్ని ఎరిగున్న మనమే ఎంతగా సానుభూతి చూపించేమో మనకి తెలును. అటువంటప్పుడు ఆ గొప్పతనం మనం కూడా అనుభవించ గల్గితే ఎంత బాగుంటుంది! అని జీవితం బోరవిసించిన ప్రతివాడికీ అనిపిస్తుంది. ఇదొక రకమైన 'మరణ వైరాగ్యం' అయితే మనిద్దరికీ ఒకే అయిడియా రావడంలో ఏదో విశేషం తప్పక వుండి వుంటుంది."

"అదేగా నేను అనేది."

"మీకేమండి...... అన్ని అనుభవాలు రుచి చూస్తున్నవారు. అందులో ఆనందాన్ని చవిగొంటున్నవారు. కాలుమీద కాలేసుకు కూర్చుంటే మీ భవిష్యత్తు బంగారపుబండిలా పరిగెత్తుకు పోతుంది. మీకిలాంటి కోరిక కల్గడం విచిత్రంగానే వుంది."

"నాకు ఈ కోరిక కల్గడంలో విచిత్రం లేదు. అన్నీ రుచి చూసాను గనుక జీవితమంటే ఏమిటో నాకు అర్థమైపోయింది. ఇకముందు కూడా ఇదే జీవితం గడపాలి. అందులో కొత్తదనముండదు. రాత్రి పగలూ ఎలా వస్తూ పోతూ వుంటాయో నాకార్యక్రమమూ అంతే. నీకింకా బోల్డంత భవిష్యత్తు వుంది. నువ్వింకా బోల్డన్ని అనుభవించాలి...అప్పుడే ఇంత వైరాగ్యమా? నువ్వు చెప్పు. నీకాబుద్ధి ఎందుకు పుట్టింది?"

"నా వెనకాల— నే పోయినా నాకోసం బాధపడే వాళ్లు లేరు గనుక......"

'అటువంటప్పుడు జీవితాన్ని ఇంకా బాగా ఎంజాయ్ చెయ్యొచ్చు. కష్టమొచ్చినా, సుఖమొచ్చినా నీదే.....! నీకు నువ్వుగా అన్నీ అనుభవించడంలో మజా వుంటుంది. "

"ఒంటరితనంలో వుండే బాధ మీకు తెలియదు మాస్టారూ.........."

"నాకు తెలుసు......."

"ఎలా?"

"నేనిప్పుడు ఒంటరివాడ్నే......!"

అదిరి పడ్డాడు రాజా.

"మరి మీభార్యా......పిల్లలూ......?"

"అంతా వున్నారు. కాని, నాదగ్గరకాదు. వాళ్ల స్వగ్రామంలో."

రాజాను ఈవిషయం మరీ ఆశ్చర్యపరచింది. రాజా చాలా కాలంనుంచి ఆ స్కూల్లో పని చేస్తున్నాడు. సచ్చిదానందం కొత్తగా వచ్చాడు. వ్యక్తిగత విషయాలు ఇంతవరకూ చర్చించుకోలేదు.

"అవును రాజా...! పైకి కనిపించేంతటి ఆనందమయ జీవితం కాదు నాది. నేను ఒకవిధమైన క్రమశిక్షణ పాటిస్తాను. నువ్వు గ్రహించే వుంటావు. అది ఒకడికి గిట్టక పోవచ్చు. అంత మాత్రం చేత వాటిని నేను మార్చుకోను. ఒకళ్ళ బాధ పడతారేమోనని నన్ను బాధపెట్టుకునే మొహమాటానికి పోను. ఇది నీకు కొత్తగా చెప్పక్కర్లేదు. ప్రస్తావనకిది అవసరం. అందుకే చెబుతున్నాను. నేను ఆధునిక ప్రపంచంలో నివసిస్తున్నాను. అంతమాత్రంచేత పూర్వాచారాలని విడిచిపెట్టుకోవాలని లేదు కదా..నాజప తపాలు మౌన వ్రతాలు నాభార్యకి విసుగు పుట్టించాయి. ఆమె నాతో తెగతెంపులు చేసుకొంటానని నోటితో చెప్పలేక పుట్టింటిలోనే జీవితం వెళ్లబోస్తోంది. మాఅబ్బాయిని చూడాలని ఉన్నప్పుడు ఆవూరు వెళ్తాను. అంతే. నాకూ వాళ్లకీ సంబంధం....! ఇప్పుడు చెప్పు..... నాజీవితమంటే ఏమిటో....? నరకం కాదంటావా......? ఈ నరకంనించి తప్పుకోవాలనిపించదూ?"

అంతా విన్న రాజా నిట్టూర్చాడు. "గుండెల్లో కార్చిచ్చు రేగుతున్నా— మీముఖంలో ప్రసన్నతకి భంగం కలగదు మాసారు...... మిమ్మల్ని అభినందించాలి. మీలో దైవత్వం లేకపోలేదు.మీ పూజలు

వృథా కావడం లేదు........."

"నన్ను తర్వాత పొగుడుదువుగాని.. ముందు చావు ప్రయత్నాలు చూడు....."

రాజా అతన్ని చూసి నవ్వాడు.

"నేను నవ్వుతాలకంటం లేదు.....డామ్ సీరియస్ తెలుసా?:...."

"అయివుండొచ్చు. కాని, మీ విచిత్రమైన కోరిక నాముందు చెప్పడంలో అర్థం లేదు."

"బాగుందోయ్....నీముందు చెప్పలేకపోతే ఎవరి ముందు చెప్పమంటావ్...అనక పోలీసోళ్ళుంటారు. చెప్పొద్దూ మరి....వాళ్లంటే నాకు భయమే మరి"

"అంతగా భయపడుతూ అలాంటి యోచన చెయ్యడం మంచిదికాదు. సరే....ఈచావుప్రయత్నం కట్టిపెట్టెయ్యండి. మరో విషయం మీదికి టాపిక్ మార్చండి."

"రాథ టాపిక్ మీదికెళ్లమంటావా ?" అన్నాడు సచ్చిదానందం నోరగా చూస్తూ.

"వద్దు, వద్దు... మీకు పుణ్యముంటుంది"..

"సరే.. అయితే...."

అంటూ కాస్సేపు ఆగాడు సచ్చిదానందం. మౌనాన్ని చీలుస్తూ—

"నాకో ఆలోచన తడుతోందోయ్!" అన్నాడు.

"ఏమిటది? అన్నట్లు చూసాడు రాజా.

రూమంతా పరిశీలించి ఎవ్వరూ లేరని నిర్ధారణ చేసుకున్న తరువాత—

"నాకు ఉద్యోగం చేయాలని లేదు. నీకు ముందే చెప్పానుగా.......? ఎప్పుడో ఒకప్పుడు రిజైన్ చేసేస్తాను. అది ఎంత త్వరలో నెరవేరితే అంత మనశ్శాంతి........"

"అయితే ఇవాళే సబ్‌మిట్ చేస్తానంటారా......"

"కాదు..... ముందు నాకో విషయం చెప్పు. నాకు స్కూల్లో ఎలాంటి గౌరవముందంటావ్?"

# ఇలా జరుగుతుం...

"చాలా— స్కూలంతా మీకూడా తిరిగి వుండలేదు కనుక— మిమ్మల్ని గురించి బయటి వాళ్లకి తెలిసింది చాలా తక్కువ. మీారంటే చాలా భక్తి గౌరవాలు!"

"నిన్ను మెచ్చుకుంటున్నా..... మొహమాటం లేకుండా చెప్పావ్......" మరినన్ను గురించి తెలిసిన నీకు—నామీద గౌరవభావం తగ్గిపోయివుండాలే...."

"లేదు....."

"ఏం.....?"

"నేను సమాధానం చెప్పలేను......"

"సరే నేనంటే అందరికీ భక్తి, గౌరవం ఉన్నాయంటావ్......?"

"అవును."

"స్కూలు కమిటీలో పరపతి వుంది. పిల్లలందరికీ పూజ్య భావముంది. స్నేహితుల్లో మంచిపేరుంది అవునా?"

"అవును......"

"సుబ్బారావు ఆఫ్ట్రాల్ ఒక సూడెంటు. అతి సాధారణమైన విద్యార్థి. వాడుపోతే ఎంతగొప్ప సానుభూతి.......?"

"అది నిజం....."

"రెండు పీరియడ్ల సెలవు కూడా...."

"కనీస ధర్మం......"

"మరి అటువంటప్పుడు ఇంతమంచిపేరున్న నేను ఒక్కసారిగా చచ్చిపోతే ఎంతబాగుంటుంది?"

రాజు సమాధాన మివ్వలేదు.

"అందులోను సామాన్యమైన చావుకాదు....ఆత్మహత్య......"

రాజా అస్వస్థతగా కదిలాడు.

"ఆత్మహత్య..... ఆత్మహత్య....." అని గొణుక్కున్నాడు లోలోపల.

"ఏం....? అలా అబ్బుర పడతావ్.... నమ్మకం కలగడంలేదా.....? పోనీ మామూలు చావే అనుకో... అప్పుడు........?"

"నా కిప్పుడు మనసేం బాగోలేదు మాస్టారూ..... తర్వాత మాట్లాడుసకుందాం. ఇప్పటికీ టాపిక్ కట్టిపెట్టేయండి......."

"పుణ్యకాలం ఆటే లేదు...... కట్టిపెట్టేస్తే ఎలా......? నువ్వు లేవకు. అలాగే కూర్చో. చెప్పేది సరిగ్గా విను. విన్నాటే ఖంగారు పెట దల్చుకోలేదు. అందుకే ఆత్మహత్య కాంప్లిల్ చేసుకుంటున్నా.... మామూలు చావు. చాలా సాధారణమైన చావు. నేను రెండురోజులు సెలవుపెట్టి ఏదో ఒకవూరు వెళ్తాను. అప్పుడు నీకో టెలిగ్రాం వస్తుంది. అందులో నా మరణవార్త వుంటుంది. నువ్వు ఆ విషయం అందరికీ చెబుతావ్...... నాకు రిజిగ్నేషన్‌తో పని వుండదు. నా మరణవార్త విన్న స్నేహ బృందం సానుభూతి ఎలాగో ఒకలాగ వింటాను. ఆ ఏర్పాటు నేను చూసుకుంటాను. తర్వాత జీవితాన్ని అంతా హాయిగా హ్యాపీ క్లేశంలో గడిపేస్తాను... అయిడియా ఎలావుంది!"

"బాగానే వుంది కాని...... హ్యాపీ క్లేశంలో మీరు చూడ్డానికి సినిమాలుండవు." అన్నాడురాజా. అతని మాటలకు తేలిగ్గా నవ్వి—

"నువ్వు సీరియస్‌గా తీసుకోవడం లేదు .... నేను చేస్తాను..... ఎప్పటికైనా చేసి తీరుతాను....అప్పుడు నువ్వే అనుకుంటావు గాక సచ్చిదానందం మాటల్లో ఎంత నిజముందని....."

"రాజుకీసారి నిజంగానే నవ్వొచ్చింది."

"మాస్టారూ.... మిమ్మల్ని అర్థం చేసుకోవడం చాలా కష్టం..... నావల్లకాదు బాబూ" అన్నాడు.

"తర్వాత బాగా అర్థం చేసుకుందువుగానిలే..... ముందు నాకు సమాధానం చెప్పు.... నీకూ్కడా అలా చేయాలని లేదూ.......?"

"లేదు.... ఎప్పటికీ లేదు..... మీ మాటలు విన్న తర్వాత చావంటే భయంగా వుంది.... ఇంకెప్పుడూ చావుమాట మీముందు ఎత్తకూడదనుకుంటున్నాను!"

"కాని నేను చచ్చిపోతానోయ్.... నువ్వు నమ్మవా.......? ఇది నిజం....."

రాజా చెవులు మూసుకున్నాడు.

"నేనిక వినదల్చుకోలేదు మాస్టారూ.... ఇంక నన్ను విడిచి పెట్టండి....."

అంతలో గంట మోగింది.

"క్లాసులేదా....?" సచ్చిదానందం లేస్తూ రాజాని అడిగాడు.

"లేదు..... ఈరెండు పీరియడ్లు లీజర్....."

"సరే..... వస్తా....."

అంటూ సంచీ చేత్తో పట్టుకుని క్లాసుకువెళ్లిపోయాడతను.








# లిప్టన్స్ హిమాలయన్
# గోల్డెన్ డస్ట్ టీ




## మేలిరకం "డస్ట్" టీలలో సాటిలేనిది

ఈ టీతో మీరు కమ్మని,
చిక్కని బంగారు
ఛాయగల టీ
కప్పుల వెంబడి కప్పులు అతి త్వరలో
తయారుచేయగలుగుదురు. ఈ పానీయమును
మీరే త్రాగి చూడండి. అతిథులకుకూడా
యివ్వండి. మీరు తప్పక సంతోషముతో
వికసిస్తారు. అవును. మీ ఆనందభరితులైన
అతిథులుకూడాను. లిప్టన్స్ హిమాలయన్
గోల్డెన్ డస్ట్ టీ మేలిరకం టీలలో
నిజంగా అద్వితీయమైనది.

లిప్టన్స్ అంటె
మంచి టీ




LHGC-5 TEL

# ఇలా జరుగుతుం...

కనుమరుగయ్యే వరకు సచ్చిదానందాన్నే చూస్తూ కూర్చున్నాడు రాజా.

'నిజంగా చాలా విచిత్రమైన మనిషి' అనుకున్నాడు మరొకసారి.

"సనాతన ధర్మాన్ని విడనాడకుండా ఆధునిక ప్రపంచంలో ఆనందాన్ని అనుభవించాలని కోరుకునేవారు చాలా కొద్దిమంది. ఆ కొద్దిమందిలో సచ్చిదానందం ఒకడు...." అనుకున్నాడు.

"రంధ్రాలున్న హకోబా బ్లవుజు వేసుకున్న ఆడవాళ్లను చూస్తే నాకు ఏమని తోస్తుందో తెలుసా? పిన్నుతో ఆ రంధ్రాలను పొడవా-ని......!"

ఒకసారి సచ్చిదానందం అన్న మాటలు ఎందుకో రాజా మనసులో మెదిలాయి.

రాజా పెదవులమీద చిరునవ్వు తొణికిసలాడింది.

"ఎందుకో ఒంటరిగా కూర్చుని నవ్వుకుంటున్నారు. మాక్కూడా కొంచెం పంచి పెట కూడదూ ...... మేమూ నవ్వుతాం......"

సా ఫ్రూంలో అడుగెడుతున్న రాధ రాజును గమనిస్తూ అంది....

"సచ్చిదానందంగార్ని తలుచుకుంటే నవ్వొచ్చింది" అన్నాడు రాజా.

"ఆయన అంత నవ్వొచ్చే మనిషా?"

"అవును....."

"ఆయన గురించి ఏదన్నా ఒక విషయం చెప్పండి ఎంత నవ్వొస్తుందో నేనూ చూస్తాను...."

అంది రాధ సచ్చిదానందం ఖాళీచేసిన కుర్చీలో కూర్చోబోయి—మానేసి, టేబుల్ మీద మోచేయానించి రాజా కళ్లల్లోకి చూస్తూ.

ఆమె గుండ్రని బుగ్గలు నవ్వుతున్నాయి. చిన్న ముక్కు నవ్వుతున్నది. విశాలమైన కళ్లు నవ్వుతున్నాయి. నొసటిమీద అలల్లాడుతున్న ముంగురులు కూడా నవ్వుతున్నాయి.

అంత అందంగా నవ్వుతున్న ముఖాన్ని చూసి రాజా సీరియస్‌గా ముఖం పెట్టాడు. అతని ముఖం, రాధ ముఖంలో కవళికల్ని ఇట్టే మార్చెయ్యగలిగింది.

"సచ్చిదానందం గార్ని నగుబాటు చేయడానికే పనిగట్టుకు కూర్చున్నానని మీరనుకుంటూంటే...క్షమించండి......" అన్నాడు సీరియస్‌గానే.

రాధ బిక్కచచ్చిపోయింది.

"సారీ నేను అలా అనుకోలేదు.... క్షమించండి.."

దిగులుపడి కుర్చీలో కూలబడింది రాధ.

తర్వాత కొద్ది క్షణాలవరకు ఎవరూ మాట్లాడలేదు.

రాజా రాధని గమనిస్తూనే వున్నాడు.

ఆమె పర్సులో నుంచి రుమాలు తీసింది. ముక్కు దగ్గర పెట్టుకుంది.

రాజాకు అర్థమైపోయింది.

"నేనేమన్నానని అంతగా బాధపడిపోవాలి.......?"

అంటూ కుర్చీ వెనక్కు జరిపి—లేవబోయాడు.

"ప్లీజ్ మాస్టారూ..... మీరు వెళ్లొద్దు. కూర్చోండి, మీరు వెళ్లిపొమ్మంటే నేనే వెళ్లిపోతాను. కానీ, వెళ్లమనేదాకా వెళ్లను."

ముక్కు ఎగబీలుస్తూనే నవ్వేసింది.

'ఏమిటీ రాధ? అంతలోనే ఏడుస్తుంది. అంతలోనే నవ్వేస్తుంది.' అనుకున్నాడు రాజా.

"ఇవ్వాళ శుక్రవారం కదూ...? ఈ రెండు పీరియడ్లు లీజర్ కదూ......?"

"అవును....." అన్నాడు మామూలుగా.

అంతలోనే అతనికో అనుమానం వచ్చింది. 'ఫలానా పీరియడు లీజరని ఈ అమ్మాయికి ఎలా తెలుసు? ఎందుకు తెలియాలి?' అని ప్రశ్నించుకున్నాడు.

"మీరేం ఆలోచించుకుంటున్నారో నాకు తెలుసు" అంది తనకుతానుగా.

"ఏమాలోచించుకుంటున్నాను?"

"మీ లీజరు పీరియడ్లు నాకెలా తెలుసా? అని... అవునా?"

రాజా మాట్లాడలేదు. సమ్మోహనంగా నవ్వుతున్న ఆమె కళ్లల్లోకే చూస్తూ కూర్చున్నాడు.

"మీకు సోమవారం అయిదో పీరియడు లీజరు. నాకూ అంతే........"

—మంగళవారం ఏడెనిమిది పీరియడ్లు...నాకూ మీకూ లీజరే...... బుధవారం మొదటి...."

"ఆపాపు....." అన్నాడు రాజా కొంచెం గట్టిగానే.

రాధ ఆపేసింది. తల భూమిలోకంటా దించేసింది. దించేసి అంది.

"తెలుసుకోవడం తప్పయితే మన్నించండి....."

ఈ పిల్ల మళ్లీ ఏడ్చేసేలా వుంది—అనుకుని,

"ఆ ...... ఆ......ఆపని మాత్రం చెయ్యకు..."

అన్నాడు రుమాలు ఆమె ముక్కు దగ్గర పెట్టుకోవడాన్ని చూసి.

అంతలో అక్కడికొక అమ్మాయి వచ్చింది.

"టీచర్..... హెడ్‌మాస్టారు పిలుస్తున్నారు..."

అంది రాధ నుద్దేశించి.

"ఈయ కొకరు..... కాస్సేపు తీరిగ్గా కూర్చోనివ్వడు.... ఆ పని చూడు ...... ఈ పని చూడు..... అంటూ చంపుకు తినేస్తుంటాడు. అందుకే చదువుకున్న స్కూల్లోనే పని చెయ్యకూడదు .... ఇప్పుడే వస్తానుండండి మాస్టారూ....." అంటూ గబగబా పరుగెట్టింది.

రాధ ప్రవర్తన రాజాను ఎందుకో తియ్యగా బాధించింది.

(ముగింపు పైవారం)

# రాబిన్ బ్లూ ప్రపంచమంతటా చాలా హెచ్చుగా అమ్మబడుతున్న నీలి

[illegible]ంతటా స్వచ్ఛమైన అల్ట్రా మెరైన్ నీలి. వస్త్రాలకు తెలుపుదనాన్ని చేకూర్చడంలో సాటిలేనిదిగాను రాబిన్ బ్లూ బహుళ ప్రఖ్యాతి పొందివున్నది.

ప్రకృతిసిద్ధమైన కంటికింపుగావుండే తెలుపుదనాన్ని చేకూర్చగల నికార్సయిన నీలి రాబిన్ బ్లూ. ఒక పొట్లంతో ఎన్నోసార్లు వస్త్రాల ఉతుకవచ్చు. రాబిన్ బ్లూ వస్త్రాలకు చెరుపు చెయ్యదని జ్ఞాపకం వుంచుకోండి.

నకిలీ వాటిని గమనించండి. అచ్చమైన రాబిన్ బ్లూ కోరి తీసుకోండి.






మీ వస్త్రాలకు ప్రకృతిసిద్ధమైన, కంటికింపుగావుండే తెల్లదనాన్ని రాబిన్ బ్లూ చేకూర్చగలదు



ARBC-29 TEL




### జరిగిన కథ

సావిత్రమ్మ ఒక మధ్యతరగతి ఇల్లాలు. ఆమె భర్త రామనరసయ్య. పెద్దకొడుకు గోపీ వారాలు చేసుకుని పై వూళ్లో 'యమ్మెస్' చదువుకుంటూ వుంటాడు. విధిలేక చిన్నవాడు మురళిని నరసింహానికి పెంపకం ఇస్తుంది. గోపీ తెలివి తేటల్ని గ్రహించి అతనికి తన ఇంటిలోనే వసతి ఏర్పాటు చేస్తాడు ప్రొఫెసరు. అతని కుమార్తె అనిత. అనిత ప్రవర్తన గోపీకి నచ్చదు.

## 3

సావిత్రమ్మ అయిదునిమిషాల కొకసారి వాకిట్లోకివచ్చి చూస్తున్నది. రామనరసయ్య ఇంకా ఆఫీసునుంచి ఇంటికి రాలేదు. లివరు జబ్బుతో వున్న ప్రసాదానికి జ్వరం పేలిపోతున్నది. పిల్లవాడి మంచమ్మీద కూర్చుని వీపుమీద రాస్తూ, సావిత్రమ్మ వీధివంక చూస్తున్నది. పిల్లవాడి ఒంటికీ కళ్లకూ పసుపురంగు వచ్చేసింది. కడుపు వత్తుగా గట్టిగా ఉంది. కాళ్లూ చేతులూ సన్నగిల్లిపోయాయి. అన్నీ తింటానని ఏడుస్తాడు. రెండేళ్లు వచ్చినా నడకరాదు. ఆరోజు మరీ చికాకుగా ఏడుస్తున్నాడు.

ఐదుగంటలయేసరికి పిల్లలు ఒక్కొక్కళ్లే ఇంటికి చేరుకున్నారు. అందరూ తలా ఒకచోట గోడకానుకుని కూర్చున్నారు. కడుపులో ఆకలి — ఇంట్లో అదుర్దా. విమల వస్తూనే బియ్యం కడిగి పొయ్యిమీద పెట్టాలని డబ్బామూత తెరిచి చూసింది. ఇద్దరు పిల్లలకయినా చాల్తాయో లేవో అన్నట్టుగా ఉన్నాయి. దొడ్డి తలుపు తెరిచి పక్కయింటినుంచి బదులు తెచ్చి వండింది.

ఆఫీసులో పని ఎక్కువయిదంటూ ఎనిమిదింటికి వచ్చిన రామనరసయ్య జ్వరంతో పడుకున్న కొడుకును చూడగానే చెప్ప దలచుకున్నమాట చెప్పలేకపోయాడు. లోపలికివెళ్లి గ్లాసెడు మంచినీళ్లుతాగి, మళ్లీ చెప్పులు తొడుక్కుని వెళ్లాడు. డాక్టర్ని తీసుకురావటానికి చేసిన ప్రయత్నాలు వ్యర్థమయ్యాయి. తిరిగి తిరిగి ఒక హోమియోపతి వైద్యుడిని తీసుకువచ్చాడు.

పిల్లవాడి కడుపుపట్టి చూశాడు వైద్యుడు. కళ్లు చూశాడు. మందుకోసం తనవెంట ఎవరినయినా పంపమన్నాడు. రామనరసయ్య కాళ్లు ఈడ్చుకుంటూ వెళ్లి పొట్లాలు తెచ్చాడు.

అర్ధరాత్రివరకూ ఏడుస్తూ మూలుగుతూ మెలికలు తిరుగుతున్నాడు పిల్లవాడు. తరువాత మగత కమ్మింది.

రామనరసయ్య మంచమ్మీద కూర్చున్నాడు. సావిత్రమ్మ గోడకు తల ఆన్చి కళ్లు మూసుకుంది. ఆమె మెదడులో ఆలోచనలు రైళ్లు పరుగెత్తినట్టుగా పరుగులు తీస్తున్నాయి. తనకు ఇది ఎనిమిదవకాన్పు. ఒక బిడ్డ పురిటిలోనేపోయినా ఆరుగురు బిడ్డలూ బలంగా పుట్టారు. ఆరోగ్యంగా పెరిగారు. అందరినీ ఏడాదిలోపున అన్నంపెట్టే పెంచింది. ఈ పిల్లవాడి బ్రతుకు మొదటినుంచీ ప్రత్యేకంగా ఉన్నది. తనకు రక్తం పలచబడి పోయిందన్నారు వైద్యులు. కాన్పు కాస్త కష్టమయింది. పిల్లవాడు పుట్టినప్పుడే దృఢంగా లేడు. డబ్బాపాలు పొయ్యటానికీ టానిక్కులు కొని యివ్వటానికీ చేతిలో పైసలేదు. పెద్దవాడికి ఏభయి రూపాయలు ఎత్తి పంపాలి. నిజానికి అవీ చాలవు గోపీకి. ఉన్న ఊళ్లో చదువులయినా పిల్లలకు పుస్తకాలకూ, ఫీజులకూ, బట్టలకూ కనీసపు ఖర్చులయినా పెట్టలేక పోతున్నది. ఆడపిల్లలు స్కూలుకు వెళ్లాలంటే అనువయిన గుడ్డలులేక బాధ పడుతున్నారు. ఇన్ని ఖర్చులలో ఈ చిన్నవాడికి మందులిచ్చి, మంచిపాలు పోసి పెంచలేక పోయింది. ఈ దురదృష్టము వాడిదా తనదా ?

తన ధ్యాసంతా గోపీమీద. ఆశలన్నీ గోపీమీద. నాలుగురోజులు కష్టపడితే డాక్టరయి పోతాడు. ఉద్యోగం చెయ్యటం మొదలుపెడితే తమ్ముళ్లను వాడే పైకి తీసుకువస్తాడు. విమల పెళ్లి చెయ్యవచ్చు. రామనరసయ్య అశ్రద్ధ మనిషి. పెద్దకొడుకు చేతికివస్తే కుటుంబమంతా వృద్ధిలోకి వస్తుందన్న ఆశలు చిగిర్చి, లతలుగా సాగి—పెరిగి చుట్టుకు పోతున్నాయి. గోపీ డాక్టరయే వరకూ ఈ చిన్నవాడు బ్రతికి బట్ట కడతాడా ?

పిల్లవాడు గుక్క తిప్పుకోకుండా ఏడుస్తున్నాడు. సావిత్రమ్మ ఎత్తుకుని తిప్పింది. నోట్లో పాలుపోసింది. తేనె నాలుకకు రాచింది. కాని పిల్లవాడి ఏడుపు ఆగలేదు. ఆ ఏడుపుకు గుండెలు కదిలిపోతున్నాయి. బయట దిక్కులు అదిరిపోయేటట్టు ఉరుముతున్నది. కుండపోతగా వర్షము కురుస్తున్నది.

'అమ్మా. పక్కలన్నీ తడిసిపోతున్నాయి గది కురుస్తున్నది' విమల ముఖంమీద పడిన వాననీళ్లు తుడుచుకుంటూ వచ్చింది.

సావిత్రమ్మ విన్నా నన్నట్టుగా తలాడించింది.

అవును. నాలుగేళ్ళయినా తిరిగి కప్పించక పోతే పాత పెంకుటిల్లు కురవదూ? ఆ యింట్లో రెండుగదులూ—వసారా—వంటయిల్లు—అన్నీ కురుస్తునే ఉన్నాయి. ఇల్లు బాగు చేయించమని యజమానిని గట్టిగా అడగటానికి నోరు రాదు. అడిగితే అద్దె సక్రమంగా చెల్లిస్తున్నారా అంటాడు. పెళ పెళ ఉరిమింది. కళ్ళు జిగేలు మనేటట్లు మెరిసింది. ఎక్కడో పిడుగు పడినట్లు ప్రకృతి దద్దరిల్లింది. సావిత్రమ్మ చేతిలో పిల్లవాడి ఏడుపు మూలుగు క్రింద మారింది. ఆమె చూస్తూ ఉండగానే బిడ్డ బిగుసుకు పోయాడు.

ప్రొద్దుగూకక ముందే విమల అన్నం వండి పిల్లలందరికీ పెట్టింది. అంతా నిద్రలో ఉన్నారు. రామనరసయ్యా సావిత్రమ్మా తలలు పట్టుకుని కన్నీరు కారుస్తూ తెల్లవారే వరకూ కూర్చున్నారు.

* * *

ఉదయకిరణాలు కిటికీల గుండా మంచమీదపడి గోపిని నిద్ర నుండి లేపుతున్నాయి. అది ఆదివారం. శరీరం కొస్త బద్ధకించింది. రాత్రి ప్రొద్దుపోయే వరకూ చదివిన నోట్సు పక్కలో పడి నలిగి పోయాయి. అనితతో కలిసి చదవటం ప్రారంభించిన తరువాత గోపికి ప్రతి పుస్తకం నాలుగేసి సార్లు చదవటం అలవాటయింది. తను ఒక్కడు మొదట చదువుకుని అనితకు చెప్పటానికి తయారుగా ఉంటాడు. ప్రతి పుస్తకం నాలుగేసిసార్లు చదవటం వల్ల ఏ విషయమయినా అవలీలగా చెప్పగలుగుతున్నాడు.

గోపీ నిద్రలేచి స్నానం వగైరా ముగించుకుని, గది తలుపులు దగ్గరగా వేసి తను ట్యూషను చెబుతున్న ఇళ్ళ వైపుగా వెళ్ళాడు. పది గంటల తరువాత ట్యూషను ముగించి సందులో నుంచి మెల్లగా నడుస్తున్నాడు. వెనక నుంచి భుజమ్మీద ఓ చెయ్యి బరువుగా పడ్డది. ఉలిక్కిపడి వెనక్కు తిరిగి చూశాడు.

కాంతం నవ్వుతూ నిలబడ్డాడు.

'ఏమిట్రా కబుర్లు?' అడిగాడు గోపీ.

'నిన్ను చూసి నీతో కబుర్లు చెప్పి ఎన్నాళ్ళో అయింది. నీవేమో మా దగ్గరికి రావు. మేము నీ దగ్గరికి రావటానికి వీలుకాదు. తెల్లవార్లూ నిద్రలేకుండా



ఏడుపేతావు కాబోలు ఏం?' అన్నాడు కాంతం గోపీని వీపు మీద తడుతూ.

ఇద్దరు మిత్రులూ కబుర్లు చెప్పుకుంటూ చాలా దూరంగా నడిచారు. పెద్ద రోడ్డుమీదికి వచ్చేసరికి కళ్ళు జిగేలుమనేటట్లు పక్కనుంచి ఒక కారు దూసుకుపోయింది. గోపీ కారులో ఉన్న అనితను స్పష్టంగా చూశాడు. కాని ఆమె ప్రక్కనున్న యువకుడిని చూడలేక పోయాడు. కాంతం గుర్తుపట్టి తల ఎగురవేశాడు.

'పరిక్షలయిపోగానే ఏం చేస్తావురా?' కాంతం ప్రశ్నించాడు.

'ముందు పరిక్షలవనీ. ఆలోచించటానికి చాలా టైముందిగా?'

కాంతం వెనక్కు తిరిగి వెళ్ళుతూ ఉండగా అనిత కారు మళ్ళీ ఎదురుగా వచ్చింది.

భోజనాల బల్ల దగ్గర ప్రొఫెసరు గోపీ అనిత కలుసుకున్నారు. గోపీ తల వంచుకుని భోజనం చేస్తున్నాడు.

'మీ స్టడీస్ ఎలా ఉన్నాయి? బాగా సాగుతున్నాయా?' ప్రొఫెసరు అడిగాడు.

ఎవరిని ఉద్దేశించి అన్నదీ తెలియక తల ఎత్తి చూశాడు గోపీ.

'చాలా తృప్తికరంగా సాగుతున్నాయి' టక్కున జవాబు చెప్పింది అనిత.

గోపీ మరింతగా తల దించుకున్నాడు.

'ఏమిటోయ్? అలా తల వంచుకుని సిగ్గుపడుతూ తింటావేమిటోయ్? మరీ అంత ముఖమాటమా? ఇవాళ మార్కెటుకు వెళ్ళి మామిడిపళ్ళు తెచ్చాను. చూడు. ఒకటి వేయించుకో. ఇప్పుడిప్పుడే వస్తున్నాయని బలవంత పెట్టి నాచేత కొనిపించాడు దుకాణదారుడు.' వద్దువద్దని గోపీ చేతులు అడ్డం పెడుతున్నా ఒక మామిడిపండు వేశాడు ప్రొఫెసర్ పళ్ళెంలో.

గోపీకి తినక తప్పిందికాదు. బల్లమీద భోజనం—అందులో మామిడిపండు. రసము ఎక్కడ చిందుతుందో నన్న భయము. గోపీ ముడుచుకుపోయి తింటున్నాడు.

అతడు పడుతున్న అవస్థనంతా చూస్తున్న అనితకు నవ్వు ఆగటంలేదు. నవ్వితే తండ్రి కోప పడతాడని భయము. ముఖము ప్రక్కకు తిప్పుకుని 'నాన్నా రసాలు కొన్నావెందుకు? కోతకాయలు కొనకపోయావా? ఇవి బాగానే ఉంటాయి కాని—తినటం కష్టం' అన్నది.

'తినటానికేం కష్టమమ్మా? అన్నీ షోకులు కాకపోతే? మామిడిపండు తినాలంటే రసాలే తినాలి. ఈ పళ్ళకాలంలో అమ్మకూ నాకూ ఇదేవాదం జరుగుతూ ఉండేది' ఆయనకు తెలియకుండానే ఒక నిట్టూర్పు వెలువడ్డది.

ప్రత్యేక సదుపాయం!

సరకు ఉన్నంత వరకే

పైసల ఖరీదైన ఆకర్షణీయమైన ప్లాస్టిక్ గ్లాసు 10 పైసలకు మాత్రమే ఈ డబ్బాలో లభిస్తుంది







బలము శక్తి మరియు

క్యాడ్బరీస్

బోర్న్‌విటా!

Benson-0460 T Ela

‘నాన్నా! ఈ వేసవిలో ఎక్కడికయినా పెద్ద ప్రోగ్రామ్ వెయ్యాలి. మీరు నాతో కూడా ఉండాల్సిందే. మీరు మరో ప్రోగ్రామ్ పెట్టుకోకూడదు.’

ఆయన తనలో తాను నవ్వుకున్నాడు.

గోపీ భోజనంచేసి — వాళ్ళమాటలు విన వట్టుగా కూర్చుని వాళ్ళ భోజనాలయిన తరువాత లేచి చెయ్యి కడుక్కున్నాడు.

*   *   *

శేషగిరి పరీక్షా ఫలితాలు వచ్చాయి. ఫస్టుక్లాసులో ప్యాసయినట్టు పేపర్లో చూడగానే తల్లిదండ్రులకు నమస్కరించాడు. రెండు చేతులతో కొడుకును లేవదీసి కౌగ లించుకున్నది సావిత్రమ్మ.

‘నాన్నా రిజల్ట్సు వచ్చాయి. నాకు ఫస్టుక్లాసువచ్చింది నాన్నా’ అన్నాడు సంతో షంతో తండ్రికి ఎదురుగా నిలబడి.

రామనరసయ్యకు కలిగిన సంతోషమంతా ముఖంలో ఒక్క వెలుగులా వెలిగింది.

‘గోపీ చదువుకంటె నీదే ముందయిం దిరా. నీవే ముందర అక్కరకు వచ్చావు’ ఎడంచేత్తో తల తడిమి చూసుకుంటూ అన్నాడు.

అప్పుడే తన చదువు అయిపోయిందా? ఉలిక్కిపడ్డాడు శేషగిరి.

‘నాన్నా నేను ఎం. యస్సీ చదవవద్దా? ఫస్టుక్లాసు వచ్చింది కనుక నాకు తప్పకుండా సీటు దొరుకుతుంది నాన్నా.’

‘సీటు కేంరా. నీకు దొరక్కపోవట మేమిటి? కాని—నీవు ఉద్యోగం చెయ్యటం అవసరం రా. ఇంటి సంగతులు చూస్తు న్నావుగా? నేనొక్కడినీ ఈ సంసారాన్ని ఈదలేకుండా ఉన్నాను.’

శేషగిరి కిటికీకి ఆనుకుని నిలబడి పోయాడు నిశ్చలంగా. సావిత్రమ్మ భోజ నానికి పిలిచిన తరువాత కదిలాడు అక్కడ నుంచి.

విమల చదువు మానేసింది. తల్లికి ఇంటి పనులలో సహాయమవుతూ ఉంటుంది. మధ్యాహ్న వేళలలో క్రిందటి సంవత్సరం చదువుకున్న పుస్తకాలు తెరిచి చూసుకుని ఒక నిట్టూర్పు విడుస్తుంది. కమల స్కూలు నుంచి రాగానే ఆనాడు అయిన పాఠాలన్నీ అడిగి తెలుసుకుంటుంది. ఆమెకు చదువుకోవాలని మనసులో ఎంత ఆశగా ఉన్నదో ఇంటి పరిస్థితులంత నిరాశ కలి గిస్తున్నాయి. శేషగిరి చదువు కూడా తన మాదిరిగానే అంతటితో ఆగిపోతుందా? కళ్ళల్లో తిరిగిన నీటిని కనురెప్పలతో అదిమి పెట్టింది విమల.

ఉదయము లేస్తూనే రామనరసయ్య శేష గిరిని పిలిచి భోజనం చేసి తనతో కూడా రమ్మన్నాడు. శేషగిరి మాట్లాడకుండా తండ్రి వెంట వెళ్ళాడు.

‘శేషగిరికి ఉద్యోగము ఇప్పిస్తానని నా స్నేహితుడు వాగ్దానం చేశాడు. రేపటినుంచీ పనిలోకి వెళ్ళవచ్చు. ఎనభై ఐదు యిస్తారు. పీడయినా చేతికి వచ్చాడు. వేళకు వాడికి భోజనం పెట్టి పంపించు’ సాయంత్రము రాగానే, పెరట్లో పని చేసుకుంటున్న సావిత్రమ్మతో చెప్పాడు రామనరసయ్య.

శేషగిరిని అప్పుడే ఉద్యోగంలో పెట్టటం సావిత్రమ్మకు ఇష్టంలేదు. పెద్దవాడు ఇంకా చదువుతూ ఉండగా చిన్న వాడి చదువు మాన్పించటం ఆమెకు బాధగా ఉంది. కాని ఈ సంసారంలో అటువంటి ఆశలూ ఆశయాలూ నెరవేరటం సాధ్యమా? శేషగిరి చదువు కంటె విమల భవిష్యన్ని గురించి ఆలోచించాలి. ఆమెకు చదువు చెప్పించలేరు. ఇక పోతే పెళ్ళి. ఆ మాట తలుచుకుంటేనే గుండె గతుక్కు మంటోంది. అట్లా అని ఆలోచించ కుండా ఉండలేక పోతోంది.

ఆలోచనలనుండి తేరుకుని తలఎత్తి చూసింది. శేషగిరి, విమల ఎదురుగా నిల బడ్డారు.

శేషగిరిని సావిత్రమ్మ పలకరించలేక పోయింది. పలకరిస్తే కన్నీరాగదు తల ప్రక్కకు తిప్పుకుని ‘విమలా నిప్పురాజే యమ్మా. వెలుతురు ఉండగానే అన్నం వండుతాను’ అన్నది.

ఆమె అక్కడినుంచి లేచేవరకూ నిలబడి ‘అమ్మా’ అన్నాడు శేషగిరి.

‘ఏం నాయనా?’ అంటూ కొడుకును కౌగలించుకుంది సావిత్రమ్మ.

‘శేషూ. నీ మనసులో ఉన్న బాధ నాకు తెలుసు. పెద్దవాడి చదువుకంటె నీ చదువే ముందరయిందని నేను సంతోష పడటంలేదు. నిన్ను ఈ నాడే ఉద్యోగంలో పెట్టి నీ మీద సంసార బాధ్యతలన్నీ రుద్దాలన్న ఆత్రం నాకు లేదు. కాని — బాబూ. నాన్న ఆరోగ్యం బాగాలేదు. రక్తపు పోటు హెచ్చుగా ఉందని డాక్టరు అన్నాడు. సంసార పరిస్థితులు నీవే చూస్తున్నావు. ఇంతకంటె మరో మార్గంలేక నాన్న అలా చేశారు. నీ మనసు కష్టపెట్టుకోవుకదూ? అన్నయ్య చదువు కాగానే నీవు మళ్ళీ చదువుకుందువు గాని...’ చుబుకం పట్టి పైకెత్తి అతడి కళ్ళల్లోకి చూసింది సావిత్రమ్మ.

కళ్ళు తుడుచుకుంటూ లోపలికి వెళ్ళి



# మొదటి ఉద్యోగమేనా?
## ఏ నెలకా నెల మీ జీతం మ్యాజిక్‌లా మాయమైపోతోందా?




### నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్‌తో
ఓ సేవింగ్స్ అకౌంట్ వుంటే చాలు
ఎంతో అండగా వుంటుంది.



నేషనల్ అండ్ గ్రిండ్లేస్‌తో
ఓ సేవింగ్స్ అకౌంట్
ప్రారంభించడమే సక్రమమార్గం.
ఏమంటే, అది మీ భవిష్యత్తుకు నాంది.
వడ్డీతో సహా మీ సొమ్ము పెరుగుతూ వుంటుంది.
గొప్ప నైతిక బలం.
అవసరానికి మిమ్మల్ని ఆదుకుంటుంది.
డబ్బు ఇక్కడా అక్కడా పడి వుండదు.
విచ్చలవిడిగా ఖర్చుపెట్టలేరు.
చీకూ చింతా లేకుండా జీవితం హాయిగా సాగిపోతుంది.
(బాస్‌ను అడ్వాన్సు అడగనక్కరలేదు).
దయచేయండి.
ఈ వారంలోనే మమ్మల్ని కలుసుకోండి.
ప్రారంభించడానికి 5/- రూ॥లే చాలును.

## నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్

(యునైటెడ్ కింగ్‌డమ్‌లో స్థాపితం
సభ్యుల బాధ్యత పరిమితం).

### తర తమ భేదంలేని బ్యాంక్

"హౌ టు స్టాప్ వర్రీయింగ్ అండ్ స్టార్ట్ సేవింగ్"
అనే చిన్న పుస్తకాన్ని ఉచితంగా పొందండి.
మీకు సమీపంలోవున్న నేషనల్ అండ్ గ్రిండ్లేస్
బ్రాంచికి వ్రాసి తెప్పించుకోండి.

NGB-21A/68 TEL

రొతున్న కొడుకును చూసి నిట్టూర్పు విడిచింది.

* * *

ఉదయంలేచి కాలకృత్యాలు తీర్చుకుని కాఫీతాగి బల్లముందు కూర్చుని పుస్తకాలు సర్దుతున్నాడు గోపీ. అనితకోసం తయారు చేసిన నోట్సు కట్టలుకట్టలుగా బల్లమీద పడిఉన్నాయి.వాటినన్నిటినీ బొత్తులుపెట్టి ఒక పక్కగా పెట్టాడు. కిటికీ తలుపులు తెరిచి మంచినీళ్ల కూజా కి టి కీ లో పెట్టాడు. గది శుభ్రం చేయాలని కుర్చీలో నుంచి లేచాడు.

ఎదురుగా ప్రొఫెసరు నిప్పులు కురిపిస్తున్న కళ్లతో భీకరంగా నిలబడ్డాడు.

విర్భాంతపోతూ నమస్కరించాడు గోపీ.

'ఈ నక్క వినయాలకేం గాని — ఈ ఉత్తరం చూడు' రెండు చేతులతో మండి గాన్ని పట్టుకుని మధ్యగా నిలబడ్డాడు.

ఉత్తరం చదువుతుంటే గోపీకి కాళ్ల క్రింద భూమి అదిరిపోతున్న ట్లయింది. ఒళ్లంతా చెమటలు పోశాయి.

'నీ జవాబు ఏమిటి దీనికి ?' గర్జించాడు.

'నేను నిరపరాధినని మాత్రమే చెప్ప గలను. ఇంతకంటె ఎక్కువగా చెప్పలేను'

అందరికంటె నీవు బుద్ధిమంతుడవనీ తెలివిగలవాడవనీ — జాగ్రత్తగా కష్టపడి చదువుతావనీ విని, నీకు సహాయం చేద్దా

# జీవితవలయాలు

మనుకున్నాను. నీ సహాయంతో అ ని త చదువుతుందని ఆశించాను. కాని — నీవు ఇలా ప్రవర్తిస్తావని కలలోనయినా అనుకో లేదు' గది దద్దరిల్లేటట్టు అరిచాడు.

'నేను మీరు ఆశించినదానికి వ్యతిరే కంగా ఏమాత్రం నడుచుకోలేదు.'

'హుఁ నిరపరాధినని చెప్పుకోటానికి కూడా సిగ్గు ఉండాలి. ఛ. నీ ముఖం నా కింక కనబరచకు' గిరుక్కున తిరిగి వెళ్లి పోయాడు ప్రొఫెసరు.

గోపీకి అంతా అయోమయంగా ఉంది. గోడకు వ్రేలాడే బట్టలు తీసి పెట్టెలో పడేశాడు. పక్క చుట్టుకున్నాడు. వాకిట్లో నిలబడి రిక్షా పిలిచాడు. సామాన్లతో సహా తిన్నగా హోటలుకు బయలుదేరాడు. ఆనాడు భోజనం చెయ్య బుద్ధి పుట్టలేదు. గదిలోపల గొళ్లెం పెట్టుకుని పక్క పరచుకుని పడుకున్నాడు.

దుఃఖము ఉవ్వెత్తుగా పొంగుకుంటూ పైకిలేస్తోంది. జేబులో ఉన్న ఉత్తరాన్ని మడతవిప్పి మరొకసారి చదివాడు.

'అనితకు గోపాల్ చదువు చెబుతున్నా డని సంతోషిస్తున్నట్టున్నారు. కాని అతడు ఆమెకు చదువు చెప్పటంలేదు. ప్రేమ పాఠాలు నేర్పుతున్నాడు. మీ అమ్మాయికి పెళ్లి కాకుండానే మీరు తాత అవుతారు కొద్ది రోజుల్లో. ఇప్పటికయినా కళ్లు తెరిచి వాళ్లిద్దరికీ పెళ్లిచేస్తే మంచిది.'

ఈ ఉత్తరం వ్రాసింది ఎవరు? తనంటే సరిపడనివాళ్లు ఎవరో అయి ఉండాలి, ఎంతసేపు ఆలోచించినా అతడికి ఎవరయినది స్ఫురించలేదు.

ఈ మధ్య అనిత సరీగా చదవటం లేదు. నోట్సు వ్రాసి యిచ్చినా వాటినీ చూడటం లేదు. తను వాటిని వినిపించి చూశాడు. ఆమె మనసు ఎక్కడెక్కడో విహరిస్తూ ఉండటం కనిపెట్టాడు. ఆమెను మంద లించటానికి గాని హెచ్చరించటానికి గాని తనెవరు? ఆమె ఎదురు తిరిగితే? నీకేం పట్టిందంటే? ఆమె తన మాట విని పించుకోనట్లు కనబడగానే ఎప్పటికప్పుడు తానే సర్దుకుంటూ వచ్చాడు.

తను నిరపరాధి. నిజమే. కాని ఆమాట నమ్మేవారెవరు? తను నిరపరాధినని బుజువు చేసుకోవటం ఎట్లా?

ఆలోచనలతో తలంతా వేడెక్కిపోయింది. కడుపులో పేగులు తోడేస్తున్నాయి. లేచి రెండుసార్లు గ్లాసుతో మం చి నీ ళ్లు తాగాడు.

ఐదుగంటలు కొట్టిన తరువాత మెల్లగా లేచి ముఖం కడుక్కుని బయటికి బయలు దేరాడు. ఎక్కడికీ వెళ్ల బుద్ధిపుట్టలేదు. ఎవరినీ చూడటానికి ఇష్టంలేదు. మెల్లగా కాళ్లీడ్చుకుంటూ సముద్రపు ఒడ్డుకు చేరి ఇసకలో కూర్చున్నాడు.

భూభాగమంతా ఆక్రమించుకుని పైకి లేస్తూ పడుతూ ఘోషిల్లే ఆ సముద్రము ఎదుట ఒంటరిగా కూర్చుని మళ్లీ ఆలో చనలో పడ్డాడు. సముద్రపు ఒడ్డున ఉన్న ఈ చిన్న పట్టణము సముద్రుడు ఆగ్ర హించితే ఏమవుతుంది? అతడికి కబళించే శక్తి ఉన్నదా? ఇటువంటి పట్టణాల నెన్ని టినో కడుపులో దాచుకునే సామర్థ్యం గల సముద్రుడు ఒడ్డు తాకుతూ భయపెడ తాడు గాని కబళించడు. ఈ సృష్టిలో కప్పలను మింగే పాములూ, పాములను కబళించే ముంగిసలూ ఒక భూమి మీదనే మనగలుగుతున్నాయి, కాని వైరం మాత్రం చావదు. కాని ఆక్షణం వస్తే ఒకదానితో మరొకదానికి చావు తథ్యము. ఆ క్షణము! ఎంత భయంకరమైనది?



బ్రతుకు మీద ఆశ నశించి ఆత్మహత్య చేసుకోవాలని సముద్రపు ఒడ్డుకు వచ్చిన గోపీ ఆ మాట మర్చిపోయాడు.

తను పరీక్ష ప్యాసయినట్లు ప్రొఫెసర్లు చెప్పారు. సంతోషంతో ఇంటికి ఉత్తరం వ్రాద్దామనుకున్నాడు. హవుస్ సర్జను అయినప్పటి నుండీ తల్లికి ఒక పాతిక రూపాయలు పంపాలనుకున్నాడు. కాని పిడుగుపాటులా నేరం తన మీద వచ్చిపడింది. తన సంతోషమంతా మటు మాయమయి పోయింది.

ప్రొఫెసరు దృష్టిలో తను దోషి. ఇంతవరకూ రానే వచ్చింది. అనితను ముఖం మీదనే నాలుగూ అడిగితే? తన మీద విరుచుకుపడ్డ నేరాన్ని — ఆమె మూలంగా వచ్చిన ఈ అపవాదును తప్పించటం ఆమె ధర్మం కాదా? నేరము ఒప్పుకొమ్మని అనితను అడిగితే? అనితకు ఇంతవరకూ ఈ సంగతి తెలియకుండా ఉన్నదా?

సముద్రపు అలలు ఉవ్వెత్తుగా పైకి లేస్తున్నాయి. ఒడ్డుకు చేరి విరిగి పడుతున్నాయి. సముద్రపు ఆవలి ఒడ్డును జేవురు రంగు అలుముకు పోయింది. క్రమంగా సూర్య భగవానుడు క్రుంగిపోతున్నాడు.

'అబ్బా. విడవండి. నా చెవి మంట పుడుతున్నది.' చెవి నులుపుకుంటూ వెనక్కు తిరిగాడు.

కాంతం ఒంగి రెండవ చెవి పట్టుకున్నాడు.

'ఏమిట్రా? ఒంటరిగా ఇక్కడ కూర్చున్నావు? పరీక్ష ప్యాసయినట్టు తెలిసినా మమ్మల్ని కలుసుకో కూడదనుకున్నావా? మేము నీతో సమానంగా చదవలేకపోయినా స్నేహానికయినా తగమా? స్నేహితులుగా నయినా నీ హృదయంలో మాకు చోటులేదా?'

'కాంతం నీవా?' కాంతాన్ని కౌగలించుకుని ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు గోపీ.

'పరీక్ష ప్యాసయ్యావటగా?'

'అవును ఎవరు చెప్పారు?'

'అవునా కాదా చెప్పు?'

'కాలేజిలో తెలిసిందా?'

అంతేనా? ఇంకేమయినా తెలిసిందా?' అడగాలని నోటివరకూ వచ్చింది గోపీకి. కాని అదిమిపట్టాడు.

'ఇంటికి ఎప్పుడు వెళ్తావు?'

'ఏమో ఇంకా ఏమీ అనుకోలేదు'

'వెళ్ళాలని లేదా? నేనయితే పరుగెత్తుకుని వెళ్ళేవాడిని కదరా'

కాంతం వీపుమీద తట్టుతూ 'ఊఁ' అన్నాడు గోపీ దీర్ఘం తీస్తూ.

(ఇంకా వుంది)

**కల్పన, కడప**

మీరు రచయిత్రుల సమావేశం కొరకు ఆంధ్రలోని రచయిత్రులందరి చిరునామాలు, వారి అభిరుచులు, జీవిత కథలు సేకరించారు. మీరు శ్రమ అనుకోకుంటే ప్రతి వారం ఒక రచయిత్రిని పాఠకలోకానికి పరిచయం చేయమని కోరుతున్నాను...

అందరివీ సేకరించ లేదు. అరవై ఎనిమిది మందివి మాత్రమే సేకరించ కల్గాను. అదీ సాహిత్య అకాడమీ వారి తరపున ప్రచురించడం జరిగింది. లోగడ అఖిల భారత రచయిత్రుల సమావేశం జరిగినప్పుడు పరభాషా రచయిత్రులతో పరిచయాలు రాశాను. మన రచయిత్రులతో పరిచయాలు లింకొక జర్నలిసు (బాపిని) చేస్తున్నారు కదా అవి విరమించు కున్నాను..... మీరు కోరిన చిరునామా అసలు వారి సమ్మతి లేకుండా పత్రికా ముఖంగా యివ్వడం సభ్యత కాదు. క్షమించండి.

**పి. ఎస్. వి. పి, భిలాయినగర్**

నేడు మన స్త్రీలు నవనాగరికతను సరించి దుస్తులు ధరించవలెనా? లేక మన ప్రాచీన సంప్రదాయము ననుసరించి ధరించవలెనా?

మీ డవుటు బాగుంది. ఉన్నకాలం పటి మనుషులు ఉంటారని నా నమ్మకం. పదేపోనీ ఆడవాళ్ళ ప్రాచీన నాగరికతకి పోతే మగవాళ్ల మాటేమిటి?... అంతా కలసి పదండి వెనక్కి అన్నట్లు పాతరాయుగానికే పోతే?

**జి. పి, మచిలీపట్నం**

పెండ్లి కాని పిల్లలు ప్రేమించి పెండ్లి చేసుకోవాలా? పెండ్లి చేసుకొని ప్రేమించాలా? లేక రెండూ మాని చదువుకోవాలా?

ప్రేమించి పెళ్లి చేసుకొన్నా పెళ్లి చేసుకొని ప్రేమించినా— భర్తనే ప్రేమించాలి!! చదువు అబ్బితే కొంతైనా చదువుకోవాలి.

అక్క చెల్లెళ్ళ పిల్లల వల్ల పెద్ద వాళ్లకు తగవులు వస్తున్నాయి ఆ కొట్లాటలు పిల్లల లోపమా? పెద్దల లోపమా?

పెద్ద వాళ్ల తప్పే. 'నా పిల్లే బంగారు కొండ' అని ఎదుటి వాళ్లమీద కత్తి కటు తారు కొందరు ఆడవాళ్ళు. అంతాపిల్లలే, వారి తత్వం నారిది. మనం పట్టించుకో కూడదన్న సంగతి మరిచిపోతారు. ఆటల్లో పడిపోయినా సరే— పడ్డావా? అనరు. ఎవరు తోశారురా? అంటూ సాగతీస్తారు. ..., పిల్లల పేచీలలో పెద్దవాళ్ళు తల దూర్చకూడదు. కాస్సేపు కొటు కున్నా వాళ్లిట్టే కలిసి పోతారు. పెద్దాళ్లు అలా కాదు కదా?!




**యస్.ఆర్.పి.ఆర్, సల్లబసాయిపల్లె**

స్త్రీకి పురుషునితో సమానంగా హక్కులు ఇవ్వవలయునని నేను వాదిస్తున్నాను. స్త్రీ బానిసగా నున్నప్పుడే పురుషుడు సుఖపడకలడని నా మిత్రుని వాదన. మీ అభిప్రాయం ఏమి?

మీ ఇద్దరిదీ ఉట్టి కంఠశోష అవి!

షాజహాన్ తాజ్‌మహల్‌ను ఏ ఉద్దేశ్యంతో నిర్మించాడు ప్రేయసి ఆత్మతృప్తికోసమా? ఆమె జ్ఞాపక చిహ్నంగానా?

చరిత్రలో ఎక్కడా 'నాకు తాజమహల్ కటు' అని షాజహాన్ భార్య అడిగినట్లు కనబడలా. ఆమె జ్ఞాపకార్థం షాజహాన్ తన ప్రేమకు ప్రతిచిహ్నంగా ఆమె పేరిట కటా డనే....

వివాహము అనబడే పవిత్ర వ్యవస్థని పురుషుడు అర్థం చేసుకున్నంతగా స్త్రీ అర్థం చేసుకోలేదేమో అనిపిస్తుంది...

ఎంత పవిత్ర వ్యవస్థ అయినా వివాహం ఇద్దరు వ్యక్తుల మధ్య బంధం. ఒకరినొకరు అర్థం చేసుకుంటూ సద్దుకుంటూ పోయినాడు అది సాగడం దుర్లభం అవుతుంది. పూర్వపు ఎనిమిదేళ్ల పెళ్లి కూతుళ్లలాగా యీనాటి అమ్మాయిలు ఉండడం లేదనా మీ బాధ? కాలం మారలేదా?

**ఎస్. సత్యనారాయణ, ఎడిటర్, తెలుగుతల్లి, ఖర్గపూరు**

తెలుగుతల్లి త్రైమాస పత్రిక, హైదరాబాదు పాఠకుడు చిరునామా కోరినట్లు మీ ప్రశ్నావళిలో చూచాను. తెలుగులోనే ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపమని వ్రాయండి.

మీరా ప్రశ్న చూసి నట్లే, అడిగిన సోదర పాఠకుడు యీ చిరునామా చూస్తాడని ఆశిద్దాం— తెలుగుతల్లి, ప్రవాసాంధ్రరచయితల సంఘం, ఎల్/52 యూనిట్—1. ఖర్గపూరు.

**పి. ఆర్. జె. ఆర్, సికిందరాబాదు**

... అన్నా చెల్లెళ్ల నడవడి ఎలా ఉంటుందో, ప్రేమికుల నడవడి ఎలా ఉంటుందో అర్థం చేసుకోరు. ఇదేం ప్రపంచం ?...నేను తనని చెల్లెలిగా భావించాను ...

మీ సుదీర్ఘమైన లేఖ చదివాక మీకు సానుభూతి తెల్పకపోతే కోపం వస్తుంది కదూ? అయినా 'అన్నా చెల్లెళ్లం' అంటూ లోకానికి నమ్మిక కల్గించాలని ఏ అన్నా చెల్లెళ్లయినా ఎప్పుడేనా ప్రయత్నించవలసి వచ్చిందా?.... అది పరాయి అమ్మాయి అయితేనే వస్తుంది. మీరలా ప్రాణానికి ప్రాణంగా ఉంటూంటే.... గొడవేలేదు. లోకాన్నెందుకు ఆడిపోస్తారు? దాని అనుమానాలు అది వెళ్ళపుచ్చుతూ ఉంటుంది. అవి నిజమైతేనేగా మీరు బుజాలు తడుముకోడం?!

**పి. ఎస్, ముస్సావురం**

వధూవరులను ఎన్నుకొనేటప్పుడు వారిలో ఏమి చూసి ఎన్నుకోవాలి ?

ఈ రోజుల్లో— ఇవ్వగల కట్నం నిర్ణయాలవి చేస్తుంది.

**ఎం. జి. ఎస్, పాత మిత్తిగిరి**

మీరంటేనూ మీ రచనలంటేనూ నాకు ప్రాణం. అందరు రచయిత్రులకు మల్లె మీ రచనల్లో పురుషలోకంపై ధ్వజమెత్తక, పురుషులని వారి స్వభావాలని విమర్శించి దుయ్యపట్టరు. పక్షపాతం లేకుండా మీ భావాలను సున్నితంగా మధుర మైన శైలిలో తేనెవాగులా ప్రవహింపచేస్తారు. ఎక్కువగా పొగడుతున్నానని మీకు కోపం వచ్చిందనుకుంటాను ...

అబ్బే. కోపం ఎందుకు. పొగడ్తకి లొంగని వాళ్ళుంటారా బ్రదర్, థాంక్స్.

ASP-MT-24TEL

# మీకు టీ కావలస్తే మూడీస్ కోసం అడగండి







మీకు టీ కావలస్తే, మూడీస్ టీ కొనండి. మీరు మూడీస్ టీ కోసం అడిగితే, దానిలో ఎంచుకోవడానికి, ఆనందకరమైన ఎన్నో వివిధ మిశ్రమములు మీకు లభిస్తాయి.

హాయికరమైన రుచిగల రాణీ డస్ట్, ఉత్సాహాన్నిచ్చే టి. జి. డస్ట్, ఎక్స్‌ట్రా స్పెషల్ క్రౌన్, శుద్ధమైన డార్జిలింగ్ టీ, అహ్లాదకరమైన సువాసనతో బాగా మిశ్రమము చేయబడిన లీఫ్ టీ, సంతృప్తికరమైన చిక్కటి కాన్సర్ట్ లీఫ్ టీ మరియు పొదుపైన మంచి రుచిగల సూపర్‌ఫైన్.

మీకు టీ కావలసినప్పుడల్లా, తప్పకుండా మూడీస్ టీ కోసమే అడగండి. ప్రతి వ్యక్తి మూడీస్ టీనే త్రాగును — మీరూ ఎందుకు త్రాగకూడదు? అందువలన మీకు నచ్చిన మూడీస్ మిశ్రమము ఎంచుకొని, ప్రతిసారి దాని పేరు చెప్పి, అడగండి.



# మూడీస్ టీ

భారతదేశములో 1863 నుండి,
బొంబే బర్మా ట్రేడింగ్ కార్పొరేషన్ వారి ఉత్పత్తి




గుమ్మం దిగుతున్న సరోజ పోస్టుమాన్ని చూసి ఆగిపోయింది.

కవరొకటి ఆమె చేతిలోపెట్టి వెళ్ళిపోయాడు, పోస్టుమాన్.

కవరు చించకుండానే అదెవరు రాశారో గ్రహించగల్గింది.

తలవని తలంపుగా ఆమె పెదవులమీద చిరునవ్వు వెలిసింది.

కవరుచించి పొడవైన ఉత్తరాన్ని చదవడానికుపక్రమించింది.

'ఏమే సరూ...! ఇంతా తొందరపెట్టి అక్కడే నిలబడిపోయావేం ? ... రా ... టైమయిపోతోంది...'

అంటూ తొందర చేసింది అక్కయ్య విశాల.

సినిమాకి వెళ్ళాలని ఆవేళ ప్రోగ్రాం. సరోజకి సినిమాలుంటే చాలు ఇంకేమీ అక్కర్లేదు. మారిన సినిమాకల్లా వెళ్ళాల్సిందే. బాగుంటే—రెండు మూడుసార్లు చూడాల్సిందే.

సినిమాకని అంత తొందరపడి, తనని తొందరపెట్టి అకస్మాత్తుగా అన్నీ మరచిన సరోజని, సరోజ చేతిలో వుత్తరాన్ని చూస్తూ—నవ్వుతూ దగ్గరికి చేరింది.

'ఎవరు? రజనేనా?' అంది.

రజని ఉత్తరాలు సరోజకి సినిమాలకంటె ఎక్కువ. అది వాళ్ళమ్మకీ, నాన్నకీ, అక్కయ్యకీ అందరికీ తెలుసు.

సరోజ మాట్లాడలేదు. ఉత్తరాన్నే ఏకాగ్రతతో చదువుకుంటున్నది.

పూర్తిగా చదివిగాని ఆమెకి సమాధానం చెప్పలేదు.

'అక్కయ్యా...ఇవ్వాళ రజని మనింటికి వస్తుందట....!'

ఆ వార్తలో తనకి కల్గిన ఆనందాన్ని మాటల్లో గుప్పిస్తూ ఉబ్బి తబ్బిబ్బయిపోయింది సరోజ.

'అవునా...! నిజమే...? రజని మనింటికి వస్తుందా? ఇవ్వాళే...'

అంతకంటె ఎక్కువ ఆశ్చర్యాన్ని ప్రకటించింది విశాల.

'అవునే...ఎలా? సమయానికి నాన్నారు అమ్మా ఇంట్లో లేరు...ఉన్నది మనమిద్దరమే...రజనికి సరయిన మర్యాద జరుగుతుందో లేదో...? నడునడు...ఆ యేర్పాట్లేవో చూద్దాం...'

'ఏమిటి సినిమా మాటో...?'

'సినిమాలేదు గినిమాలేదు...... ముందు స్టవ్ వెలిగించు ...' అంటూ లోపలికి వురికింది సరోజ.

'పిచ్చిపిల్ల' అని నవ్వుకుంటూ పనిలో నిమగ్నమయింది విశాల.

అక్కయ్య వంటప్రయత్నంలో వుండగా తన గదిలోకి వెళ్ళింది సరోజ.

బీరువా తెరిచి అందులోనుంచి ఒక పెద్ద ఉత్తరాలకట్ట తీసింది. విప్పి, ఆ రోజు వచ్చిన ఉత్తరాన్నికూడా అందులో వేసి మళ్ళీ బీరువాలో పెట్టేసింది.

ఆ క్షణంనుంచి సరోజకి ఏంచెయ్యాలో తోచలేదు. 'రజని వస్తూంది ... రజని వస్తున్నది...' అదే ఆమె స్మరణ.

ఎలా వుంటుందో? ఫోటోలోకంటె అందంగా వుంటుందా? తనకంటె బాగానే వుండివుండాలి. ఏం పనిమీద వస్తున్నదో ఏమో? ఉత్తరం రాసిన రోజే బయలుదేరి వచ్చేస్తున్నది! అంత అర్జెంటుపని ఏమొచ్చిందబ్బా...?'

ఎన్నో ప్రశ్నలు సరోజ తలని వేడెక్కించ సాగాయి.

రజని అనుకోకుండా తన జీవితంలో ప్రవేశించింది. కేవలం ఉత్తరాల ద్వారానే ప్రాణానికి ప్రాణంగా సన్నిహితమైంది రజని. ఇంతకాలంనుంచి ఆమె నామస్మరణంతోనే గడిపింది. ఈ రోజు ప్రత్యక్షం కాబోతున్నది.

ఇలా ఆలోచిస్తున్న ఆమెకి రజని రాసిన మొదటి ఉత్తరం చదవాలనిపించింది. ఆ వుత్తరం నాటి పరిచయానికి—నేటి సాన్నిహిత్యానికి వ్యత్యాసం చూడాలనిపించింది.

ఉత్తరం చేతిలోకి తీసుకుంది.

'ప్రియమైన సరూ...!

ఈ సంబోధన నీకు ఎంతో కొత్తగాను వింతగాను వుంటుంది. ఎవరీమె? ఇంత దగ్గరగా సంబోధిస్తున్న దెవిటి? అని ఆశ్చర్యపడుతూ వుంటావు. నాకు తెలుసు. ఈ వుత్తరాన్ని పూర్తిగా చదువు. నీ ప్రశ్న లన్నింటికీ సమాధానం దొరుకుతుంది. ఇంకా ప్రశ్నలేమైనా మిగిలిపోయి వుంటే నాకు రాయి. సందేహ నివృత్తి చేస్తాను. సరేనా? అలా తెల్లబోతావేం? ఇక చదువు—

నా గురించి నీకు అంతగా తెలియక పోవచ్చుగాని నీగురించి నాకు బాగా తెలుసు. సువర్చల అంతా చెప్పింది. సువర్చలా నేనూ చాలా దగ్గర స్నేహితులంలే. సువర్చల ఎప్పుడూ నీ గురించే చెబుతూ వుంటుంది. మాటాడిన అయిదు నిమిషాల్లోనూ మూడు నిమిషాలు నీ గురించే అయివుంటుంది! ఆమె ద్వారానే నువ్వు నాకు పరిచయమయ్యావు. సువర్చల అంతగా ప్రేమిస్తున్న నీలో ఏదో విశేషం వుండకపోదు. సువర్చల మాటల్నిబట్టి నువ్వు నన్ను చాలా ఆకర్షించావు. నీ అంత మంచి దానితో స్నేహంచేస్తే తీరాలనిపించింది. సువర్చలతో నా అభిప్రాయం చెప్పాను. వెంటనే నీ అడ్రసిచ్చింది. ఆ అడ్రసు సాయంతోనే నీకీ ఉత్తరాన్ని రాయగలుగుతున్నాను. మరచా... సువర్చల, నేనూ గుంటూరులో కలిసి చదువుకున్నాం. ఇప్పుడు నీకు చాలా విషయాలు తెలిసి వుండాలి. గుంటూరులో వున్నప్పుడు నిన్ను నేను మామూలుగా చూశానేగాని, ఒకే క్లాసులో చదువుకున్నవాళ్లం కాదు. అప్పుడు నాకు సువర్చలతో ఎక్కువ పరిచయంలేదు కూడాను. ఇప్పు డనిపిస్తోంది... అప్పుడు సువర్చలతో ఎందుకు స్నేహంచేశాను కాను? ఇదే అభిలాషతో అప్పుడు నిన్ను ముఖతః పరిచయం చేసుకుని స్నేహం పెంచుకుని వుంటే ఎంత బాగుండేది? ... అని. వింత కోరికే కదూ...? నాకు నీతో స్నేహం చెయ్యాలనివుంది. వెంటనే జవాబు రాస్తావు కదూ...?

వుంటా ...

నీ

రజని

రజని మొదటి ఉత్తరాన్ని చదివిన రోజున తను ఎంతగా ఆశ్చర్యపోయిందో చెప్ప నలవికాదు. తనేకాదు. ఇంట్లో వాళ్లంతా ఎంతో ఆశ్చర్యపడ్డారు.

తాము గుంటూరులో వున్నది నిజమే. అక్కడ తను చదువుకున్నమాటా వాస్తవమే. ఈ సువర్చల ఎవరు? ఈ రజని ఎవరు? ఇవే తనకి, ఇంట్లో వాళ్లకి తెగని ప్రశ్నలు.

తన గురించి అంతగా తెలిసిన సువర్చల లెవరున్నారు? ఎవరూ లేరే! ఎప్పుడూ తననిగురించి మాట్లాడే ఈ సువర్చల ఎవరై వుంటారు? అని వింత తల్లబద్దలు చేసుకున్నా సమాధానం రాలేదు.

అదే విషయం తన ఉత్తరంలో రాసింది.

దానికి సమాధానం రజని దగ్గరనుంచి చాలా ఎక్కువ కాయితాలతోనే వచ్చింది. సువర్చల గురించి తమ స్నేహం గురించి ఎంతెంతగానో రాసింది. కాని... అందులో తనకి కావలసిన సమాధానం లేదు. ప్రసక్తిని మరొకవిధంగా మరల్చుతూ—ఆర్ట్సు గురించి, ఆర్టిస్టుల గురించి ఎక్కువ రాసింది. తన పెయింటింగ్స్ పత్రికల్లో పడుతుంటాయని రాసింది. సువర్చలకి పెయింటింగ్ మీదున్న అభిరుచితో ముడిపెట్టి ఉత్తరం అదొకరకంగా రాసింది.

తనకి పెయింటింగ్ చెయ్యడమన్నా, బొమ్మలు గియ్యడమన్నా ఎంతో సరదా. అంత సరదావున్న మిత్రురాలు ఒకరై దొరికినందుకు తను సంతోషించింది. కాని ...సువర్చల జ్ఞాపకం వచ్చినప్పుడుమాత్రం తమ మైత్రిలో ఏదో 'వెలితి' అనిపించేది.

ఉత్తరాల ద్వారానే తర్వాతర్వాత ఎంతో సన్నిహితులై పోయారిద్దరూ. ఈ నాటికీ సువర్చలసంగతి తనలో మెదుల్తూ వుంటుంది. 'ఎవరీ సువర్చల?' అని. మొదట్లో తనురాసిన ఉత్తరా లన్నింటిలోనూ వరసగా సువర్చల సంగతి ఎత్తింది. రజని దగ్గరుంచి వచ్చిన ఉత్తరాల్లో కూడా సువర్చల సంగతి వుండేది. కాని రజని రాతలో ఏం వుందోగాని ... చదువుతున్నంతసేపూ ఎంతో హాయిగా వుండేది. తన ప్రశ్నకి సమాధానం దొరక్కపోయినా కోపం వచ్చేదికాదు తనకి. ఉత్తరాలద్వారా అంత చక్కని స్నేహం లభించినందుకు మురిసిపోతూ రానురాను సువర్చల సంగతి పూర్తిగా మరచిపో ప్రయత్నించింది.

ఇవ్వాళ రజని రానున్నది. సువర్చల గురించి తప్పక తెలుసుకోవాలి అనుకున్నది. రజని రాసిన ఉత్తరంలో తన ఫోటో పంపమని రాసింది. తనూ రజని ఫోటో కోరింది. అబ్బే...వెంటనే పంపిస్తేనా? వట్టి మొండిఘటం! అప్పుడు పనిగట్టుకుని నాన్నారితో స్టూడియోకివెళ్లి ఫోటో తీయించుకుని పంపింది. తను పంపిన రెండు మూడు వారాలకి రజని ఫోటో కూడా వచ్చింది.

## లిట్ క్విజ్ నెం. 40–18 క్లూలు

1. మానవుడు తనలో అత్యంత మహాశక్తులను గుప్తమైయున్న బుద్ధులను గలిగి యున్నాడు గాని నిజంగా వాటిని గురించి ఏవిధమైన ధారణ / సూచన ఏమాత్రం కలిగియుండ లేదు.

2. సభ్యతాభివృద్ధి కోసం ప్రజల మధ్య ఐకమత్య / సంపర్క సంయుత విధిగా సర్వదా ఆవశ్యకమై యున్నది.

3. ఆంగ్లేయ బాష ద్వారా శిక్షణ నిస్సంశయంగా మనలో అనేక పోరాటములకు / చెరుపులకు కారణమైయున్నది.

4. సంతుష్టి / వివేచన లేకుండా ఆనందంగా జీవించే మానవుని జీవితం దీర్ఘవ్యాధి పీడితం.

5. జనులు అత్యంత సభ్యులై యుండవచ్చును గాని అత్యంత సుసాంస్కృతికులు / వికసిత జ్ఞానులు అయివుండక పోవచ్చును.

6. వివేక శాలునికి, జీవితం ప్రకాశమానం మరియు ప్రసన్నత/జ్ఞాన అన్వేషణ మరియు సఫల సిద్ధి. భోగం మరియు తీర్థ యాత్ర రెండున్ను గలవు.

7. నిజమైన, లోకతంత్రం/ఐతిహాసం యదార్థములను అణచివేయరాదు ఎంత అప్రియమైనదైనా సరే.

8. హృదయాధికారం పరిపూర్ణం, బుద్ధి సామర్థ్యమైనది/ఉత్కృష్టమైనది అయినప్పటికీ తగ్గు స్థానమునే అదిష్ఠించవలెను.

9. విశ్వవ్యాప్త సమానత / నైతికత యొక్క ఆవరణలు బాహ్యమున విశ్వవ్యాప్త వ్యవస్థ లేదు.

10. స్వాతంత్రం / జ్ఞానం కొరకు మానవుని అన్వేషణ యందు వివేకం ముఖ్యపాత్రను నిర్వహించవలసి యున్నదని అంగీకరించుటకు జ్ఞానంగల ఏ మానవుడున్ను సంకోచించడు.

11. జీవితమందలి దుఃఖములు మరియు కఠిన వేదనల మధ్య సహితం హాస/ప్రకాశక్షణములుగలవు.

12. ప్రతి మానవుని యందును ఈశ్వరుడున్న యెడల సహజంగా ప్రతిఒక్కరూ ఉదారులై స్వతంత్రులై యుండవలసి వుంటుంది.

13. న్యాయ ప్రయత్నం మీకు ప్రతి వ్యక్తి యొక్క స్వాతంత్ర్య / జీవిత హక్కును గుర్తించ గలిగిస్తుంది.

14. ధనం మరియు ఆనందం / అధికారం కోసం మన ఆశలకు అంతులేదు. మరి ఆ వృద్ధి అవలంబింపు కొలదీ కలుగుతుంటుంది.

15. గౌరవము/విశేషాధిక్యతా లోపంగల వ్యక్తి దానిని కలిగియున్న వారి పట్ల ద్వేషం గలిగయుండును.

16. జ్ఞాన హీనమైన వంపు, భక్తి, గ్రుడ్డివి మరియు త్యాగం/ సేవలేనిదే వ్యర్థం.

17. ఎచ్చోటను మనశ్శాంతిగాని లేక, సుబిద్ధి/ సురక్ష గాని లేదు.

18. మానవుడు ప్రస్తుత శకమందు పూర్వం ఎప్పుడూ ఉండనంత చాలా ఎక్కువ వివేకియై/ శీఘ్ర గ్రాహ్యుడై మరియు సహన శీలుడై యున్నాడు.

## No. 40: 18 CLUES

1. Man has within himself tremendous powers and latent faculties of which he has really never had any **Conception / Intimation**.
2. A necessary prerequisite in the progress of civilization has always been the **Concord / Contact** between peoples.
3. Education through the medium of English, has doubtless been responsible for several **Conflicts / Evils** in our midst.
4. To the man who enjoys without **Contentment / Disernment** life is a long disease.
5. A people may be highly civilized but may not be as highly **Cultured / Developed**.
6. Life is both light and **Delight / Learning** to the discerner, pursuit and attainment, pleasure and pilgrimage.
7. True **Democracy / History** must not suppress facts, however unpalatable.
8. The heart's sway is absolute: the head, **Efficient / Excellent** though it is, must take a subordinate place.
9. There is no universal order outside the pale of universal **Equality / Morality**.
10. No man of sense will hesitate to agree that reason has a vital role to play in man's search for **Freedom Wisdom**.
11. Even in the midst of miseries and bitter agonies of life there exist moments of **Laughter / Light**.
12. If God is there in every man, then every one has got to be **Liberal / Liberated** as a matter of course
13. Love of justice will lead you to recognize every person's right to **Liberty / Life**.
14. There is no end to our desire for possessions and **Pleasure / Power** and it grows by what it feeds on.
15. A person who lacks **Prestige / Privilege** may bear prejudice against one who enjoys it
16. Love and devotion are blind without wisdom and useless without **Sacrifice / Service**.
17. There is no rest or **Sanity Security** anywhere.
18. Man in the present age is far more **Sensible / Sensitive** and tolerant than he ever was in the past.

**గమనిక:** పై క్లూలు భారతీయ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తో పాటు లిట్‌క్విజ్ వీక్లీలో ప్రచురించబడును

# మనసులో మనసు

ఏమంత అందంగా వుండకపోయినా, అనాకారి మాత్రంకాదు. చూపుల్లో ఏదో ఆకర్షణశక్తి గుంజాతున్నట్టుగా వుంటుంది! ఉత్తరాల్లోనే తనని ఆకర్షించిన రూపం అది. ఆమె ఫోటోకి ఫ్రేముకట్టించి భద్రంగా దాచింది. రోజూ ఏదో ఒక సమయంలో ఆ ఫోటోని చూడకుండా తను వుండలేదు!

'ఏమే...ఏం చేస్తున్నావ్...? డబ్బాలో సేమ్యాలుంటాయ్... కొంచెం వేయించు...' అంటూ పిలిచింది అక్కయ్య.

అక్కయ్య పిలుపుతో వుత్తరాల కట్ట అక్కడే వుంచి, ఆలోచనలకి స్వస్తి చెప్పి వంట గదివైపు దారి తీసింది.

రెండు మూడు రకాలయిన పిండివంటలు, పాయసమూ తయారుచేసి రజని కోసం ఎదురు చూడడం మొదలు పెట్టారు అక్కా చెల్లెళ్ళిద్దరూ.

తను వేసిన పెయింటింగ్స్, బొమ్మలూ అవీ రజని రాగానే చూపించాలనే కుతూహలంతో వాటిని భద్రపరిచింది సరోజ.

ముక్కూ మొహం తెలీని మనిషితో ఇంత గాఢమైన స్నేహం ఏర్పడడానికి ఏదో పూర్వజన్మ సుకృత ముండి వుండాలని, లేకపోతే ఒక్క సంవత్సరంలో ఇంతగా ఆత్మీయులు కాలేరని సుజాత అనుకుంటున్నది. ఈ విషయాన్ని రజనికి చాలాసార్లు రాసింది కూడాను.

అసలు ముఖాముఖీ కలుసుకోగల అవకాశం వస్తుందా? అని అనుకునేది తను. అలాంటిది 'ఈరోజు ఆ అవకాశం కలుగబోతున్నది' అని అనుకున్నప్పుడు ఆమె మనసు సంతోషంతో పరవళ్ళు తొక్కింది.

సంవత్సరం నుంచి ఆమెను చూసే అవకాశం లేక పోయినా, సంవత్సరమూ గిర్రున తిరిగిపోయింది. కొద్ది సేపటిలో రజనిని చూడబోతున్నా, ఆ ఎదురు చూడడంలో ఎన్నో సంవత్సరాలు దొర్లిపోతున్నట్టుగా అనిపించసాగింది!

వెల్లెలు కాలుగాలిన పిల్లిలా వీధి గుమ్మంలో నుంచి ఇంట్లోకి, ఇట్నుంచి వీధి గుమ్మంలోకి తిరుగుతూంటే, విశాల డైనింగు టేబుల్ మీద అన్నీ సర్దడం ప్రారంభించింది. అలా సర్దుతూ మధ్య మధ్యలో 'ఇంకా రాలేదూ? ఇంకా రాలేదూ?' అంటూ ప్రశ్నిస్తూ వుంది.

రజని ఒక్క సరోజతోనే స్నేహం చెయ్యాలని వాంఛించినా, రజనికి సరోజ ఇంట్లో వాళ్ళంతా స్నేహితులైపోయారు. సరోజ రజని ఉత్తరాలకి ఎంతగా ఎదురు చూసేదో, అంతగానూ ఇంట్లోవాళ్ళు ఎదురుచూసేవారు!

రజని గురించి ఇంట్లో చర్చించుకోని రోజంటూ వుండదు. ఎక్కడి హైద్రా బాదు! ఎక్కడి అనకాపల్లి! ఇంట్లో వాళ్ళందరికీ ఈ స్నేహం విచిత్రంగా కన్పించినా రజని మొదటి ఉత్తరం వచ్చింది లగాయితూ సరోజకి ఇంట్లో ఒక ప్రత్యేకస్థానం లభించింది. తండ్రీ తల్లీ కూడా ఆమెని ప్రత్యేక గౌరవంతో చూసేవారు. విశాల ఒకోసారి లోలోపల ఈర్ష్యచెందినా, అసహనాన్ని మాత్రం కనబరచేదికాదు. చెల్లెలంటే వున్న ప్రేమ చొప్పున ఆమె అదృష్టానికి తను కూడా పొంగిపోయేది.

రజని వస్తున్నదంటే విశాలకి కూడా ఎంతో ఆనందంగా వుంది. ఎదురు చూస్తూనే వుంది.

సాయంత్రం అయిదయింది ... ఆర యింది...ఆరున్నరయింది. ఎక్కడా రజని జాడ లేదు.

గంటలూ నిమిషాలు లెక్కపెడుతున్న కొద్దీ సరోజలో ఆత్రుత ఇనుమడించ సాగింది. రజని దర్శనంకోసం తహతహ ఎక్కువవడం మొదలెట్టింది.

కను చీకటిపడి ముదురుతున్న సమయంలో రోడ్డుమీద మామూలుగా తిరిగే వాళ్ళుతప్ప మరే కొత్త ముఖమూ కనిపించడంలేదు. 'ఇదిగో వస్తుంది...ఇదిగో వస్తుంది...' అనుకుంటూ గుమ్మంలో నుంచుని రోడ్డుని వెదకడం మొదలు పెట్టారు అక్కాచెల్లెళ్ళిద్దరూ.

రోడ్డుకు చివరి మొగలో 'కళ్ళజోడబ్బాయి' కనిపించాడు సరోజకి.

ఏం కుర్రాడోగాని, రోజూ తను కాలేజీకి వెళ్ళివస్తూన్నప్పుడల్లా దారి కాస్తుంటాడు. అతను తనతో మాట్లాడాలని తాపత్రయపడుతూ వుండడం ఎంతోకాలంగా కనపడుతూనే వుంది.

ఈ అల్లరి గుణం తప్పితే కుర్రాడు బాగానే వుంటాడు. తనని అల్లరి పెట్టనంతవరకు ఫరవాలేదు. ఎప్పుడన్నా ఏదన్నా గొడవ చేస్తే మాత్రం నాన్నారితో తప్పకుండా చెప్పెయ్యాలి. ... అబ్బాయి ఆట

# మనసులో మనసు

కట్టించెయ్యాలి.

ఉన్నట్టుంటాడు. కొన్నాళ్ళు మాయమవుతుంటాడు. అతను వూళ్ళో వున్నంత కాలం తనకి ఏదోలావుంటుంది. ఫ్రీగా తిరగడానికిగాని, సరదాగా కాలేజీకి వెళ్ళడానికి గాని వీలయేదికాదు. అతను కనిపించని రోజుల్లో హాయిగా తిరగ్గల్గుతుంది.

ఈ మధ్య చాల రోజులుగా కనిపించడం లేదు. ఏదో వూరెళ్ళుంటాడు. ఇదిగో ఇవ్వాళ మళ్ళీ తగులడ్డాడు కాబోలు, బీటు కాస్తున్నాడు.

ఇలా వూరుకుంటే లాభంలేదు. ఎప్పుడో ఒకసారి నాన్నారితో చెప్పెయ్యాలి.

అతనేం చేస్తున్నాడని చెప్తుంది? తనని చూడడం తప్పని, కళ్ళు కుట్టేసుకోమని,నాన్నగారుమాత్రం ఎలా దండిస్తారు?

కళ్ళజోడబ్బాయి కనిపించి రజని ఆలోచనని చాటు పరచినందుకు విసుక్కుంది.

రజని ఇంకా రాలేదేమో!?

ఉత్తరంలో తప్పు చదవలేదు కదా!

'అక్కయ్యా ఉత్తరం ఇటుతేవే...' అందుకుని అక్కయ్య వంక తిరిగింది.

అక్కయ్య ఆ వుత్తరాన్నే అప్పుడు చదువుతూవుంది.

'టైము ఇవ్వలేదు. ఈపాటికి వస్తూ వుండాలి. అప్పుడే ఏడు కావొస్తూంది.' అంటూ ఉత్తరాన్ని సరోజ చేతి కిచ్చింది.

ఉత్తరాన్ని మరోసారి చదువుకుని రోడ్డు కేసి చూసింది సరోజ.

కళ్ళజోడబ్బాయి తప్పితే రోడ్డుమీద ఎవరూ కనిపించడంలేదు.

కళ్ళజోడబ్బాయి కదిలాడు. ఇటే వస్తున్నాడు.

ఛీ...వీడికిదేంపని? ... బొత్తిగా బుద్ధి లేకుండా? తనని చూడడం తప్పితే వేరే పనిలేదా వీడికి? అనుకుంది.

'నా కాకలేస్తోందే... నేను అన్నం తినేస్తాను గాని...నువ్వు కాస్సేపాగి చూడు...' అంటూ లోపలికి వెళ్ళింది విశాల.

అతను తమ యింటివేపే వస్తున్నాడు. ఇదివరకు అంత ధయిర్యంగా వచ్చేవాడు కాడు. ఇదేమిటి? సూటిగా ఇటే వస్తున్నాడు. వచ్చి ఏమైనా అల్లరి పెట్టడు కదా...

అదిగో ఇటే వస్తున్నాడు. తను వంటరిగా వుందన్ని, పలకరించాలని వస్తున్నాడు.

విలా...విలా...

గుమ్మంలో నిలబడ్డాడు.

లోపలికి వెళ్ళిపోవా లనుకుంది. మరి రజని...? ఇల్లు తెలియదు. వెతుక్కుంటూ వస్తే మరీ ఆలశ్యం అవుతుంది. ఇలాగే గుమ్మంలో నుంచుని చూస్తే ఆమె కనబడవచ్చు. ఇక్కడే నిలబడితే మంచిది— అనుకుంది.

మరి ఈ బ్రాహ్మడో? ఎదురుగా, దగ్గరగా, ఎంత నిస్సంకోచంగా నిలబడ్డాడు!

'ఏయ్ ... అబ్బాయ్! నీకేం పనిలేదా నన్ను చూడ్డం తప్పితే ... ?' అని అడిగేస్తే...?

అంత ధైర్యం తన కెక్కడిది? అక్క ఇక్కడేవుంటే ఆమె ధైర్యం చూసుకుని అలాగే అడిగేసును కాని ... దానికి ఆకలెక్కువ...హుం ... ఆకలి ... వెధవ ఆకలి ఇదీను. రజని రాకుండా దీనికి ఆకలెలా అయ్యిందో ఏమిటో?

కళ్ళజోడబ్బాయిమీద విసుగును అక్కమీద చూపించింది. తనమీద చూపించుకుంది. రజనిమీద చూపించేంతలో ఆ అబ్బాయి అందుకున్నాడు.

'ఏమండీ ... మీతో ఒక విషయం మాట్లాడాలండీ...?'

'ఎందుకు? మీతో నాకు మాట్లాడవలసిన పనిలేదు.' అని దులిపేస్తే బాగుండును. కాని నోట్లోంచి మాటరావడం లేదు. అంతగా తనని ఆరాధించే అతన్ని చూస్తే మనసు మూగవోయింది. ఏమీ అనలేక పోతోంది.

'ఏమండీ...నామీద మీకు చాలా కోపం కదండీ...?'

'అవును...చాలాకోపం...నిన్నుచూస్తేనే నాకువొళ్ళు మండిపోతుంది...' అనేస్తే ఎంత బాగుండును?కాని అనలేక పోతోంది. ఏమిటో ఈ అశక్తత?

'నన్ను అపార్థం చేసుకోకండి. మిమ్మల్ని ప్రాణానికి ప్రాణంగా ప్రేమిస్తున్నాను నా ఆశల్ని కూలద్రోస్తే నేను బ్రతకలేను. నేనుచెప్పేది విని నన్ను అర్థం చేసుకోడానికి ప్రయత్నించండి.'

తుపాకి నుంచి వెలువడే బుల్లెట్లలా గడగడా వచ్చేశాయి అతని నోటినుంచి మాటలు. ఎన్నిసార్లు వల్లించుకున్నాడో ఏమో!

'అయింది. అనుకున్నంతా అయ్యింది. ఇతను నన్ను ప్రేమిస్తున్నాడు. ఓ శుభ

మయూన ఇలాంటి విపత్తును ఎదుర్కోవాలని వూహిస్తూనే వున్నాను. నేనూ ప్రేమిస్తున్నానని చెప్పేవరకూ కదిలేలా లేదు. ప్రేమ జాడ్యంతో బాధపడుతున్నాడని నేనెప్పుడో గ్రహించాను. అందమైన ఆడపిల్ల కనిపిస్తే చాలు ... ప్రేమ పాఠాలూ పిళ్ళాను. ఆశలు కూలిపోతే బ్రతక లేదట...బ్రతక లేదు ... వట్టి దగుల్బాజీ మాటలు...'

'మీ నాన్నగారు అమ్మగారు వూళ్లో లేరు. మీ అక్కయ్య లోపలున్నారనుకుంటాను. మీతో రెండు నిమిషాలు మాట్లాడే అవకాశం కల్పించండి.' అంటూ మరీ దగ్గరగా వచ్చాడతను.

'నాతో మీరేం మాటాడనక్కరలేదు. ఎవరన్నా చూస్తే చాలా గొడవవుతుంది. వెళ్లండి. వెళ్లండిక్కణ్నుంచి.' అంది ధైర్యం చేసి.

'నే చెప్పేది వినండి. నన్నర్థం చేసుకోండి. ప్లీజ్...మీ కోసం...ఈ అవకాశం కోసం ఎంతకాలంనుంచో ఎదురుచూస్తున్నాను. ఈనాటికి చిక్కింది. నన్ను చెప్పనివ్వండి...ప్లీజ్...'

'నువ్వు నాకోసం ఎదురుచూస్తున్నట్టు తెలుసులే. నువ్వు వేసే వేషాలన్నీ నాకు తెలుసు. ఈ విషయం నాన్నారితో చెప్పాలనుకుంటున్నాను కూడాను.'— అని చెప్పాలనుకుంది.

కాని, 'అవును. అలా చూడ్డంలో మీ ఉద్దేశ్యమేమిటి ?' అని మాత్రం అనగల్గింది.

'నేను మిమ్మల్ని ఆరాధిస్తున్నాను మిమ్మల్ని చూడలేకపోతే నేను పడే బాధ మీకు అర్థంకాదు. మీరు నన్ను అర్థం చేసుకోడానికి ప్రయత్నించండి. మీ రిప్పుడు ఎవరికోసం ఎదురుచూస్తున్నారో నాకు తెలుసు...నేను...నేను...'

'నేను ఎవరికోసం ఎదురుచూస్తున్నా, మీ కోసం మాత్రం కాదు ... మీరు వెళ్లొచ్చు...'

'నాకోసం మీరు ఎదురుచూడడంలేదు. చూడరు కూడాను. అదే నా బాధ. మీరు రజనికోసం ఎదురుచూస్తున్నారు. ఇది మాత్రం నిజం...'

ఆ మాటతో అవాక్కయి చూసింది సరోజ. ప్రాణమున్న ప్రతిమలా నిలబడిపోయింది.

# మనసులో మనసు

గుండె గుబగుబలాడింది. కాస్సేపటికి తేరుకుని,

'నీకు...ఎలా...ఎలా...ఎలా తెలుసు?'

గొంతు బొంగురుపోయింది. నిలువెల్లా వణికింది. ఇంతటి సత్యాన్ని అతను ఎలా గ్రహించగల్గాడా? అని ఆశ్చర్యపోయింది.

'నాకు తెలుసు. మీరు రజనిని చూడ లేరు...'

'ఎందుకు చూడలేను ... చూస్తాను. ఇవ్వాళ వస్తున్నట్టు నాకు ఉత్తరం రాసింది వస్తుంది. నేను చూస్తాను. ఆ సంగతి నీకు అనవసరం''

'మీ నమ్మకాన్ని మెచ్చుకుంటున్నాను. వచ్చినవాళ్లతో మనసిచ్చి మాట్లాడండి చాలు. రానివాళ్లకోసం ఎందుకు ఎదురు చూస్తారు ?'

'మిస్టర్ ... నువు అధిక ప్రసంగం చేస్తున్నావు. వెంటనే గుమ్మందిగు. లేదా అక్కయ్యని పిలవాల్సి వస్తుంది...'

'మీరు నన్ను నా ప్రేమని అర్థం చేసుకోలేక పోతున్నారు. చేసుకోలేరేమో...!'

అతని కంఠం వణికింది. కళ్లలో స్రవించిన నీళ్లు వేలితో తుడుచుకున్నాడు.

కరిగిపోతున్న హృదయాన్ని అదుపులో పెట్టుకుంది సరోజ.

'మీరు వెళ్లండి ... ప్లీజ్ ... తర్వాత మాట్లాడుకుందాం. వో మిత్రురాలి కోసం ఎదురు చూస్తున్నాను...'

'ఆ మిత్రురాల్ని నేనే. నా పేరు రజనీ కాంత్...మిమ్మల్ని నమ్ముకున్నవాణ్ణి. నే నెంత గాఢంగా ప్రేమించి మీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపానో అర్థం చేసుకోండి ప్లీజ్...' ఒక్క గుక్కలో అనేశాడు గబ గబా.

నిలువుగా కంపించి పోయింది సరోజ. ఆమెకి వాస్తవమేదో, అవాస్తవమేదో తెలియలేదు. భంగపాటు సామాన్యమైనదిగా ఆమెకి కనిపించలేదు. అవమానం, ఉద్రేకం ఆమెని వశం తప్పించాయి.

'దొంగ...'

'... ... ...'

'దొంగ...ఉత్తరాలు...'

'... ... ...'

'దొంగ పేర్లు...'

'... ... ...'

'దొంగ ఫోటోలు...'

'... ... ...'

అంటూ చేతి కందుబాటులో వున్న అతని ముఖాన్ని కందగడ్డలా చేసి, నొప్పెట్టిన చేతులతో, దెబ్బతిన్న గుండెతో, శక్తిని కోల్పోయి కుర్చీలోకి వొరిగి పోయింది.

'ఎందుకిలా అయ్యింది ? ఎందుకిలా అయ్యింది?'

ఇవే ఆమె ప్రశ్నలు. ఆమెని మింగివేసే ప్రశ్నలు.

అతను చాలా సేపటివరకు అలానే నిశ్చలంగా నిలబడ్డాడు. ఆమె చేతి దెబ్బలు అతనికి బాధనిపించలేదేమో! లేక అందుకు సిద్ధమయ్యే వచ్చాడో?...మరి.

'నేను రేపటి వరకు వుంటాను ... మీ నిర్ణయం చెప్పండి...నాలుగో వీధిలో—మీరు కాలేజీకి వెళ్లే దారిలోనే మా యిల్లు. హైదరాబాదులో చదువుకుంటున్నాను.' అంటూ వెనుదిరిగి వడివడిగా నడిచి వెళ్లి పోయాడు.

'ఏమిటే...గట్టిగా అరుస్తున్నావ్...?' అంటూ చేతులు తుడుచుకుంటూ వచ్చింది విశాల.

విశాల జరిగిందంతా చాటుగా చూసింది గనక ఆమె క్రోధంతో ఉడికిపోయింది.

'ఇలాంటిదేదో జరుగుతుందని నేను వూహిస్తూనే వున్నాను. అలానే అయింది. జులాయి వెధవలు. మంచీచెడ్డా తెలియదు. చూడు...ఎన్ని ఆశలు పెట్టుకున్నావ్ ... ఇప్పుడేమయింది? నా మనసే ఎంతో ఇదిగా వుంది ... అదే నేనయితే నాన్నారితోచెప్పి చితక తన్నించేదాన్ని...రోగ్...'

'అక్కయ్యా...' అంది రుద్ధకంఠంతో, సరోజ.

'నేను రజనీకాంత్‌ని పెళ్లిచేసుకుంటానే ... ఇందుకు నువ్వు సహాయం చేస్తావు కదూ...' అంది ఆమె వొళ్లో తలదాచుకుంటూ.

అర్థం కాని విశాల అయోమయంగా చూస్తూ ఆమె తలని నిమిరింది. ●

వి. నేతాజీ, కొత్తగూడెం.

ప్ర : నటనలోని లోతుపాతులను తెల్సుకోవాలంటే నాటక రంగమా? లేక సినిమా రంగమా?

జ: ఏ రంగంలో నయినా కృషి, క్రమశిక్షణ, పట్టుదల వుంటే తెలుసుకోవడం యేమంత పెద్దపనికాదు.

ఎస్. ఎస్. కె. ప్రసాదరావు, చిట్వేలి.

ప్ర : సిస్టర్, దేవుడు లేడని వాదించే నాస్తికులకు మోక్షం ఎలా వస్తుంది? మరి, మీ దృష్టిలో దేవుడున్నట్లేనా?

జ: దేవుడు లేడు...లేడు అని వాదిస్తూనే దేముణ్ని స్మరించే నాస్తికులకు మోక్షం యెందుకురాదు బ్రదర్! మరి నామటుకు చెప్పాలంటే దేవుడు అనేవాడు వుండకపోతే మనకు భయం, గియం వుండనే వుండదనుకుంటున్నా.

బి. వి. కె. సుబ్బారావు, విజయవాడ.

ప్ర : మీరు సినిమాల్లో వేసే నృత్యాల దుస్తులు సినిమా చూచే ప్రేక్షకుల మీద యేవిధమయిన ప్రభావం కల్గిస్తాయో మీరు వూహించి చెప్పగలరా?

జ: అది నా వూహకందని విషయం —మీరు చెప్తేనేగాని తెలుసుకోలేని పరమ రహస్యం.

తిరుమలశెట్టి నరేంద్ర, తాడేపల్లిగూడెం.

ప్ర : మిమ్మల్ని 'ఆంధ్ర హెలెన్' అంటే ఏమంటారు? మీకు అలాంటి పొగడ్తలంటే యిష్టమా?

జ: ఇప్పుడు మీచే 'ఆంధ్రా హెలెన్' అనిపించుకుంటున్న నేను త్వరలోనే ఆంధ్రా 'హీరోయిన్'అనిపించుకుంటాననే నమ్మకం యిప్పుడిప్పుడే యేర్పడుతోంది.

కుమారి ఎస్. సుగుణ, సీతారాంపురం వెస్ట్.

ప్ర : మీరు, మరికొందరు యీమధ్య సినిమాల్లో జుగుప్సాకరమైన వస్త్రాల్లో డ్యాన్సులు చేస్తున్నారు. చూస్తుండే ప్రేక్షకులకు సిగ్గువేస్తుంది? మరి మీకు అన్పించదా ?

జ: పాత్ర స్వభావాన్నిబట్టి దుస్తులు ధరించకపోతే ఆపాత్ర రాణించదు. మీకు








సిగ్గువేస్తుందా? ఆ సిగ్గుయెలా అనిపించిందో కాస్త శెలవివ్వరాదూ!

ఎ. సత్యనారాయణ, పార్వతీపురం.

ప్ర : కళ సినీ పరిశ్రమపై జీవిస్తుందా? లేక సినీ పరిశ్రమ కళపై జీవిస్తుందా?

జ: 'సినిమా' వ్యాపారంతో కూడిన 'కళ' అనేది నా అభిప్రాయం.

కే. కృపవి, వైమానికదళం, జమ్మూ కాశ్మీర్.

ప్ర : నా స్వంత చెల్లెళ్లు, అక్కయ్యగానీ నన్ను ప్రేమించరు, వేరే స్త్రీలు నన్ను తమ్మునిగా, అన్నయ్యగా అమితంగా ప్రేమిస్తారు, ఎందువలన తెల్పుతారా?

జ: అంతర్గతంగా ఆరాధించే వాళ్ళు ప్రేమను వెళ్ళబోసుకోరు. అవసరాల కోసం బంధుత్వాన్నికోరే పరస్త్రీలు ఆత్మీయులు కాలేరు.

ఎం. ఎస్. నారాయణ, విశాఖపట్నం.

ప్ర : మీ రంత సెక్సీగా నటిస్తుంటారు కదా మీకు సిగ్గువేయదా ?

జ: నేను సెక్సీగా నటిస్తానేగాని, నా సెక్సుతో జీవితాన్ని గడుపుకోవడం లేదే; అది కేవలం 'నటన'—దీని కెందుకండీ యింత ఆర్భాటం; అదీగాక సిగ్గువేయదా అని అడగడానికి మీ మనస్సు యెలా ఒప్పుకుంది.

ఎస్. వేణుగోపాల్, ప్రొద్దుటూరు.

ప్ర : మీ రెందుకు యెక్కువ సెక్సు చిత్రాల్లో నటించుచున్నారు ? మీకు 'గుణదాసు' చిత్రంలో మంచిపాత్ర అనుకుంటాను. మీరు నటించిన చిత్రాంలో మీకు నచ్చిన చిత్రం ఏది ?

జ: ప్రేక్షకులు యెందుకు యెక్కువ సెక్సుచిత్రాలను చూస్తున్నారో, అందుకు; అవును 'గుణదాసు' లో గుణచిత్ర పాత్రను ధరిస్తున్నాను; మీరు మెచ్చిన ప్రతి చిత్రం నాకు నచ్చిన చిత్రమే.

బహుమతి పొందిన ప్రశ్న

పెళ్లూరు విజయ, విడవలూరు.

ప్ర : మీరు ధరించిన పాత్రల్లో ఏదైనా మీపై యెట్లాంటి మార్పునైనా తీసుకొనివచ్చిందా ? అసలు అలాంటి అవకాశం వుందా ?

జ: నాలోమార్పా — యెందుకు? — మీదయవల్ల ఆరోగ్యంగానే వున్నానే— అలాంటి అవకాశం వచ్చినప్పుడు మీ సలహా తీసుకుంటానుగా.

# ఉండమ్మా బొట్టు పెడతా

హిందూ స్త్రీ కోరికని బాగా అర్థం చేసుకుని—వారిని ఆకట్టుకోగల ఆకర్షణని మూసలో పోసి—అందులోంచి 'ఉండమ్మా బొట్టు పెడతా' చలనచిత్రాన్ని పడగొట్టి నట్టు అనిపిస్తుంది.



'ఉండమ్మా బొట్టు పెడతా'లో జమున.

మూలం మహారాష్ట్రం నుంచి. కథ మనదే. అంతా మన గ్రామ వాతావరణం లోనే సాగుతుంది. అవుట్‌డోర్‌కి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వక పోయినా కథకి అనుగుణమైన చిత్రీకరణ గ్రామ జీవనాన్ని బాగా ప్రతిఫలింప జేసింది. ఇందుకు ముఖ్యకారణం 'ట్రీట్‌మెంట్'లో వివేకం. కథాంతం 'అకస్మాత్తు'గా ముగుస్తుంది. ఈ క్లయిమాక్సు సీను ఇంకా థ్రిల్లింగ్‌గా వుండివుంటే సంతృప్తికరంగా వుండేది.

క్రమశిక్షణలేని నలుగురన్నదమ్ముల కుటుంబంలోకి 'మహాలక్ష్మి'లాంటి కోడలు వచ్చి కుటుంబాన్ని చక్కదిద్దడం ఇందులో ఇతి వృత్తం. ఆకోడలికి లక్ష్మీదేవి ప్రసన్నం కావడం, లక్ష్మీదేవిని ఆయింట చిరకాలం వుండేలా కోడలు కట్టివేయడం—ఇవి ఈ సాంఘిక చిత్రానికి పెట్టని ఆభరణాలు.

మహాసాధ్వియైన కోడలి పాత్రని జమున రసవత్తరంగా పోషించింది. ఆమె భర్తగా కృష్ణ నటించాడు. ప్రత్యేకంగా ఆకర్షించే పాత్ర నాగభూషణంది. తదితర ముఖ్య పాత్రల్ని నాగయ్య, చలం, ధూళిపాళ, రంగారావు, జానకి, సూర్యకాంతం, సూర్యకళ, మీనాకుమారి మొదలైనవారు పాత్రోచితంగా పోషించి చిత్రానికి సౌభాగ్యాన్ని కూర్చారు.

ఆదుర్తి సుబ్బారావు సమర్పించిన బాబూ మూవీస్‌వారి ఈ చిత్రానికి దర్శకుడు కె. విశ్వనాథ్, సంగీతం కె. వి. మహదేవన్ నిర్మాత పి. సుందరం.

—సికరాజు



'అగ్గిమీద గుగ్గిలం'లో సత్యనారాయణ, విజయలలిత.

# సినిమా

ప్రముఖతారలు విజయలలిత, చలంలు తలకొక క్యారియర్ బుట్టలను మోసుకు పోవడాన్ని చూచి కంగారు యెత్తింది. ఇద్దరూ మాంచి డిమాండు వుండే ఆర్టిస్టులే; వీళ్ళకి యీ అవస్థ యేమిటని తెమలక తికమక పడుతున్న సమయంలో కె. బాలచందర్ నా భుజం తట్టాడు. ఆయన్ని చూడగానే అసలు విషయం అర్థమైంది. ఈ వేషాల్లో పై యిద్దరూ 'సత్తెకాలపు సత్తెయ్య' చిత్రంలో కన్పిస్తారు. క్యారియర్ మోతతోనే సరిపెట్టుకోక తమ కెరియర్‌నుకూడ జయప్రదం చేసుకుంటారు. జీవితంలో అమాయకంగా వుంటే, యెలాంటి సమస్యలను యెదుర్కోవలసి వస్తుందో, అమాయికుడివల్ల సంఘానికి జరిగే మంచి, చెడులు యెంతవరకు వుంటాయో తెల్సుకోవాలంటే ప్రసాద్ ఆర్ట్సు నిర్మిస్తున్న 'సత్తెకాలపు సత్తెయ్య' చూస్తే సరిపోతుంది. కె. బాలచందర్ వ్రాసిన కథకు పిడిశెట్టి పదునైన సంభాషణలు, ఆయా పాత్రలకు నటీ నటులు ప్రదర్శించిన హావభావాలు మన హృదయాల్లో మధురానుభూతిని కల్గిస్తాయని నమ్ముతున్నాను. నిజం యెంత నిష్ఠూరం అని తాత్కాలికంగా అనిపించినా, అది యెంత పవిత్రమో కాలమే నిర్ణయిస్తుంది అని యీ చిత్రం బోధిస్తుంది. ఈ చిత్ర నిర్మాత ప్రసాద్ వయస్సులో పసివాడే అయినా, చక్కటి కథను మనకు చూపిస్తున్నందుకు అభినందించి తీరాలి. చిత్రంలో విన్పడే ఆరు పాటలు మీకు అమృతపాణి అరటిపండు తీపిని రుచి చూపిస్తాయి. 'సత్తెకాలపు సత్తెయ్య'గా చలం ఆ పాత్రలో జీవించాడు అనడం అసందర్భం కాదనే నా వాదంతో సినిమా చూసిన తర్వాత మీరూ యేకీభవిస్తారని వూహిస్తున్నాను. గౌరిగా విజయలలిత కూడ తనలో జీర్ణించి వున్న నటనావైదుష్యాన్ని బహిర్గతం చేసిందనే చెప్పాలి. మిగతా ముఖ్య పాత్రలను శోభన్‌బాబు, రాజశ్రీ, గుమ్మడి, ఎస్వరలక్ష్మి, బేబి రోజారమణి, రావికొండలరావు వుచితరీతిలో పోషించారు.

ఈ చిత్రానికి సంగీత సారథి విశ్వనాథం వెన్నుముకలాంటివాడు. చిత్రం షూటింగు దాదాపు పూర్తయింది. అయినా జనవరి దాకా మన ముందుకి వచ్చేట్టులేదు.

### భక్తితో నేర్చిన విద్య

మిక్కిలినేని మహారాజు; అతనివద్ద పరిచారకుడు కాశీనాథ్ తాతా; యువరాజు సత్యనారాయణ. సేవకుడి కుమారుడు టి. ఎల్. కాంతారావు; మిక్కిలినేని తన కుమారుడ్ని అస్త్రవిద్యాభ్యాసానికై గురు



'పెళ్లిరోజు'లో హరనాథ్, జమున.



'బంగారు సంకెళ్లు'లో జమున.

కులంకు పంపిస్తాడు. ఎ. వి. సుబ్బారావు (జూనియర్) సత్యనారాయణకు సమస్త శాస్త్రాలను నేర్పుతాడు; టి. ఎల్. కాంతారావును కూడ శిష్యునిగా తీసుకొని అతనికి అన్ని విద్యలను నేర్పమని రాజశ్రీ ప్రాధేయపడుతుంది. కానీ, ఎ. వి. సుబ్బారావు అంగీకరించడు. కాంతారావు నట్టడవిలో తన గురువుగా ఎ.వి. సుబ్బారావును మనసారా ధ్యానించి సకల శాస్త్రాలను తన సహచరుల సహకారంతో నేర్చుకుంటాడు. ఒకరోజు మిక్కిలినేని గురుకులంకు వస్తాడు; తన కుమారుడి అస్త్రవిద్యా విన్యాసాన్ని కళ్ళారా చూడా



'సదమంత్రపుసిరి'లో విజయలలిత.

## సినిమా

అని పువ్వీళ్ళూరుతాడు; సత్యనారాయణ తన నేర్పును ప్రదర్శించి శెభాష్ అని పించుకుంటాడు. తనకు సాటిలేడని విర్ర వీగుతాడు; ఆ సమయానికి కాంతారావు అక్కడకి రావడం, అతన్ని రంగంలోకి మిత్రులు దించడం; తను కీకారణ్యంలో ఏకలవ్య భక్తితో నేర్చుకున్న అస్త్రవిద్యా భ్యాసాన్ని ప్రయోగించి చూపరులను ఆశ్చర్యచకితుల్ని చెయ్యడం, సత్యనారాయణకు కోపాన్ని రేపింది; తన గురుదేవుడయిన సుబ్బారావును పరుషవాక్కులతో సత్క రిస్తాడు; తనకన్నా మిన్న అయిన కాంతా రావును యువరాజు ఏం చేస్తాడు ? మహా రాజు మిక్కిలినేని తీర్పు యెలా వుంటుంది? అన్న ప్రశ్నలకు సమాధానం గౌరి ప్రొడ క్షన్స్ 'దేవుడు యిచ్చిన భర్త' చిత్రం చూస్తే తెలుస్తుంది. శ్రీ ఎస్. భావనారా యణ నిర్మిస్తున్న యీ జానపద చిత్రం శ్రీ పద్మరాజా కలంనుండి వెలువడింది. స్త్రీకి భర్తే దైవం అనేడి సత్యాన్ని నిరూపించే పవిత్రమయిన కథను తెర కెక్కిస్తున్నందుకు నిర్మాతను అభినందిం చాలి. జానపథ చిత్రాలంటే కేవలం కత్తి సాము, మంత్ర తంత్రాలు, మాయా మంత్ర జాలాలతో వుంటాయి అనుకోడం పొరపాటు అని 'దేవుడు యిచ్చిన భర్త' నిరూపిస్తుంది. ఒక చిత్రంయొక్క మంచి,



'పుష్కర మహిమ'లో మణిమాల

చెడ్డలు; జయాపజయాలు ప్రేక్షకులయిన మీ చేతిలో వుంది. కథ మంచిదయితే, దానికి మీ ఆదరణ తప్పక లభిస్తుంది అని నేను వూహించడం తప్పు కాదేమో.

### ప్రతీకారం అనాగరికం

లంకేశ్వరుడి వేషంలో రామకృష్ణ దర్శకుడు రామగోపాలరావుతో తన నైజాన్ని గురించి యిలా వివరిస్తాడు.

రామకృష్ణ: అబ్బబ్బ ! యిలాంటి పాత్రలంటే నాకు తగని అసహ్యం; పతితల్ని —పతివ్రతల్ని రక్షించడమంటే నాకు

## సినిమా డైరీ

● ప్రార్థన ఫిలింస్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రం యొక్క రెండవ షెడ్యూలు వాహినీ స్టుడి యోలో అక్టోబరు 4 నుండి 7 వరకు జరిగింది. ఈ షెడ్యూలులో కృష్ణ, రాజశ్రీ, సత్యనారా యణ, విజయలలిత, రాజబాబు పాల్గొన్నారు. ఇందులోని ప్రొఫెసర్ పాత్రను ధూళిపాళ ధరి స్తున్నారు. ఈ చిత్రానికి జి. విశ్వనాథం దర్శకుడు.

● మహేష్ పిక్చర్స్ యూనిట్ కొడైకెనాల్‌లో మూడు రీళ్ల చిత్రాన్ని షూట్ చేసి అక్టోబరు 2 కు మద్రాసుకు చేరింది. ఇన్‌డోర్ షూటింగు 15 వ తేది నుండి 25 వరకు వాహిని స్టుడి యోలో జరుగుతుంది. శ్రీ డి. రామానాయుడు నిర్మించే యీ చిత్రానికి జి. విశ్వనాథం దర్శకుడు.

● పూర్ణచిత్ర నిర్మించిన "పెళ్ళిరోజు" చిత్రం అక్టోబరు 12 విడుదలౌతుంది.

● జయశ్రీ లక్ష్మి పిక్చర్స్ నిర్మించిన "చెల్లెలికోసం" అక్టోబరు 24 విడుదలౌతుంది.

● శ్రీ రాజ ఆరు పిక్చర్స్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రం యొక్క షూటింగు కర్పగం స్టుడి యోలో అక్టోబరు 3 నుండి ప్రారంభమైంది. ఈ షెడ్యూలులో ముఖ్య నటీ, నటులందరూ పాల్గొన్నారు. ఈ చిత్రానికి కె. ఎస్. గోపాలకృష్ణన్ దర్శకుడు.

● జోతి సినీసిండికేటు నిర్మిస్తున్న "కంచు కాగడా" చిత్రంలో కృష్ణ, శోభన్‌బాబులు నటి స్తున్నట్టు గతవారం వార్తల్లో ప్రకటించడం జరిగింది. వారికి బదులుగా ఆ పాత్రలను ప్రభాకర రెడ్డి, రామకృష్ణలు (మిస్టర్ మద్రాస్) పోషిస్తున్నారు.

● ప్రముఖ నటుడు శ్రీ జగ్గయ్య (ఎం.పి.)కి అక్టోబరు 6వ తేదీన "గ్రామదేవతలు" షూటిం గులో చేతికి దెబ్బ తగిలింది. శ్రీ జగ్గయ్యను మాధవి పిక్చర్స్ అధినేతలు శ్రీ ఎ. ఎస్. ఆర్. ఆంజ నేయులు, రాజేంద్రప్రసాద్ స్థానిక ప్రైవేటు హాస్పిటల్‌కు తీసికెళ్లి ఎక్స్‌రే తీయించారు. త్వరలోనే స్వస్థత చేకూరగలదని డాక్టర్లు వివరించారు.



'శ్రీరామకథలో' గుమ్మడి, జయలలిత.

## సినిమా

వేరథా? ఇష్టం లేకపోయినా నటుడిగా ఈ పనులు చెయ్యక తప్పదు.

రావుగోపాలరావు: అవును. అది మీ ధర్మం (అంటూ రామకృష్ణ చేతికివున్న ఆంజనేయుడి బిళ్ళనుచూసి) మీరు వేస్తున్నది రావణబ్రహ్మ వేషం; రావణాసురుడి చేతికి ఆంజనేయస్వామి బిళ్ళవుంటే బాగోదు.

ప్రేక్షకులూరుకోరు. అంచేత దాన్ని...

రామకృష్ణ: తీసెయ్యమంటారా సర్; క్షమించాలి సర్; నా చిన్నతనంలో, నా అన్న మంటలో దగ్ధమైపోయి, మా అక్క ఘోరమయిన పరాభవంతో యేమయిందో తెలియక ఆంజనేయ స్వామిముందు భోరున యేడ్చాను. అప్పుడు బాబాజీ వచ్చి నాకు యీ రక్ష నిచ్చాడు; ఈ రక్షే నన్నింతవాడ్ని చేసిందనినమ్ముతాను, మీకు తెలుసుకదు సర్; నేను పేపర్ బోయ్‌గా బ్రతికాను; బూట్‌పాలిష్ చేసాను; ఒక చిన్న పాత్రధారిగా ప్రవేశించి యింత వాడ్ని అయ్యాను.

రావు గోపాలరావు: వెరీ సారీ మిస్టర్ రామకృష్ణ! మీ గుండెల్లో యింత బాధ వుందా; మిమ్మల్ని చాలా కష్టపెట్టాను; మిమ్మల్ని అంతగా హింసించిన ఆ దురాత్ముడ్ని శిక్షించలేక పోయారా?

రామకృష్ణ: ఏంచెయ్యమంటారు సర్! జ్ఞానం పెరిగే కొలది ప్రతీకారం అనాగరికం అనిపిస్తుంది. ఈ ఘట్టం బాలా ప్రొడక్షన్స్ నిర్మించిన 'బంగారు సంకెళ్ళు' చిత్రంలో వస్తుంది; 'బంగారు సంకెళ్ళు'లో 'సీతాపహరణం' నాటకం యేమిటి? రామకృష్ణ రావణ బ్రహ్మ వేషం వెయ్యడం యేమిటి? రామకృష్ణ గుండెల్లోని బాధ చల్లారిందా? లేదా? అన్న ప్రశ్నలకు సమాధానం అక్టోబరులో మీకు దర్శన మివ్వబోయే 'బంగారు సంకెళ్ళు' తీరుస్తుంది. అంత వరకు ఓపిక పట్టండి; మీ మెదడుకు మేత నివ్వండి; ఈ సమస్యలకు సమాధానం తెలిసినా, చిత్రం చూచేంతవరకు మీ మిత్రులకు చెప్పకండి. ఈ సమస్యాత్మక సాంఘికచిత్రాన్ని ప్రేక్షక జనరంజకంగా శ్రీ జి. రామినీడుచిత్రీకరించారు. చిక్కటి కథకు, చాంద్ కమ్మటి సంగీతాన్ని విన్పించాడు. శ్రీ పి. సత్యనారాయణ నిర్మించిన యీ చిత్రం విశాలాంధ్రలో పూర్ణా పిక్చర్స్ విడుదల చేస్తున్నారు. చిత్రంలోని ముఖ్య పాత్రలను హరనాథ్, జమున, గుమ్మడి, జి. వరలక్ష్మి, ప్రభాకరరెడ్డి, రాజబాబు, రావికొండలరావు, కాకరాల, రమాప్రభ, టి. జి. కమలాదేవి, బాలయ్య, రామకృష్ణ (అతిధి) నటించారు; కెమెరాను స్వామి, ఆర్టును రాజేంద్రకుమార్; కూర్పును అంకిరెడ్డి; నిర్మాణ నిర్వహణను చెటర్జీ, పబ్లిసిటీని మోహన్‌కుమార్ సక్రమంగా నిర్వహించి చిత్రాన్ని అనుకున్న తేదికి విడుదలయ్యేందుకు బాధ్యులయ్యారు.



'దేవుడిచ్చిన భర్తలో' రాజశ్రీ, కాంతారావు.

# మీకు తెలుసా?

హాలివుడ్ నటి ఎలిజబెత్ టెయిలర్ ఆడంబరంగా జీవిస్తుంది. ఎలిజబెత్ రాణికి జరిగే మర్యాదలన్నీ యీమెకు జరుగుతూ వుంటాయి.

నటి కె.ఆర్. విజయకు షూటింగు లేకపోతే తన స్నేహితులకి ఫోన్ చెయ్యడం ఒక సరదా.

నటి రాజశ్రీకి విరామం దొరికితే చాలు 'వివాహం' సమస్యపై తీరుబడిగా చర్చిస్తుంది.

క్యారెక్టరు నటి శ్రీమతి షావుకారు జానకికి నెక్లెస్ ధరించడమంటే చాలా యిష్టం.

ప్రముఖ హిందీనటి మీనాకుమారికి లండన్‌లో చికిత్స జరిగింది. ఆమెను ఆ సమయంలో ఆదుకున్న వ్యక్తి మహానటి నర్గీస్ అని మీకు తెలుసా?

'వెన్నెల ఆడ్డె' చిత్రంలో నటించిన హాస్యనటుడు మూర్తి ఒక న్యాయవాది.

## స్వయంవరంలో విష ప్రయోగం

వాణిశ్రీకి స్వయంవరం; రాజులందరూ స్వయంవరానికి వస్తారు; రాజుగారి మేనల్లుడు అశోక్‌కుమార్; అతడికి వాణిశ్రీపై మోజు; ఆమెను దక్కించుకోవాలంటే స్వయంవరానికి విచ్చేసిన రాజులను హతమార్చాలి; అందుకే గీతాంజలిని ఆయుధంగా వుపయోగించుకుంటాడు; ఆమెచే వచ్చిన అతిథులందరికీ విషంగలిపిన మధువును త్రాగిస్తాడు; పాపం రాజకుమారులంతా పరలోకాన్ని చేరుకుంటారు; ఈ విపత్కర సంఘటన జరిగిన సమయంలో కృష్ణ, ప్రసాద్ అక్కడికి వస్తారు; వచ్చి యీ విషాద వార్తవిని నిర్ఘాంతపోయారు. విధివశాన వాళ్ళు యీ స్వయంవరానికి చేరుకోనందుకు సంతోషిస్తారు; కానీ కృష్ణకు ఒళ్ళుమండింది; అశోక్‌కుమార్ అంతు చూడాలనుకుంటాడు. ఈ సన్నివేశం భారతి పిక్చర్స్ నిర్మిస్తున్న జానపద చిత్రంలోనిది; ప్రముఖ ఛాయాగ్రాహకుడు రవికాంత్ నగాయిచ్ డైరెక్టు చేస్తున్న మొట్టమొదటి తెలుగు చిత్రం యిదే; అనుకున్న ప్రకారం కృష్ణ పగ సాధిస్తాడా; వాణిశ్రీని పెండ్లాడుతాడా? పరలోకగతులయిన రాజకుమారులను బ్రతికిస్తాడా? అన్న ప్రశ్నలకు సమాధానం భారతి పిక్చర్స్ చిత్రమే; ఈ చిత్రంలో

పరిచయం:



## రూపాలంకారి

# రమేష్

ఒక నటుడికి అతడు ధరించే పాత్రను బట్టి రూపాలంకరణ చెయ్యాల్సి వస్తుంది. ఒకేనటుడు వివిధ చిత్రాల్లో విభిన్న పాత్రలను ధరించాల్సి వచ్చినప్పుడు అతడి రూపురేఖావిలాసాల్ని తీర్చిదిద్దడం మేకప్ ఆర్టిస్టు యొక్క కర్తవ్యం.

అనుభవం తక్కువే అయినా, వృత్తిలో మమకారం అధికం కావడంచే రూపశిల్పి రమేష్, తన చేతిమీదుగా నటీనటులకు సంతృప్తికరంగా మేకప్ చేస్తూ యెవ్వరూ వూహించని విధంగా ప్రముఖ రూపాలంకారుడిగా వినుతి కెక్కాడు.

ఒక నటునికి యెంతవరకు పాన్‌కేక్ వూయాలి, యెంత లిప్‌సిక్ వూయాలి, ముఖంలో రంగు యెంత వుండాలి అని వూహించుకొని, ఆ ప్రకారం మేకప్ చేస్తే ప్రతిపాత్ర శోభిస్తుంది అని అంటాడు రమేష్.

ఇప్పుడిప్పుడే మంచి అవకాశాలు వస్తున్నాయి., వాటిని సద్వినియోగం చేసుకుని తన్ను పోషించుకుని, తన్ను నమ్ముకున్న వారిని మెప్పించి, ముందు ముందు ఘన విజయాన్ని సాధించడానికి ప్రయత్నించగలడని ఆశించవచ్చు.



'కథానాయకుడు' చిత్రంలో రామారావు, జేబి పద్మిని.

# సినిషా

వాణిశ్రీ మూడు విభిన్నమైన పాత్రలను పోషిస్తుంది; అప్పలాచార్య రచన కొత్తబాటను తొక్కింది; కోదండపాణి సంగీతం మరికొంత ముందంజ వేసింది. ఇప్పటికి నాల్గురీళ్ళ చిత్రం తయారైంది. భారీ యెత్తున నిర్మింపబడుతున్న యీ చిత్రం జానపద చిత్రయుగంలో ఒక కొత్త రికార్డును యేర్పరచగలదని వూహిస్తున్నారు. ఈ చిత్రాన్ని శ్రీ మల్లికార్జునరావు నిర్మిస్తున్నారు.

## తెలుగులో వక్త్

శ్రీ తోట సుబ్బారావు అక్టోబరు ఒకటవ తారీఖున తన కొత్త చిత్రంయొక్క ప్రారంభ పూజను బోగ్‌రోడ్‌లోని తన ఆఫీసు భవనంలో వేదోక్తంగా జరిపారు. ప్రముఖ నిర్మాత శ్రీ త్రివిక్రమరావు పూజ చేశారు. శ్రీయుతులు ఎన్. టి. రామారావు, విశ్వేశ్వరరావు, డి. వి. ఎస్. రాజా, గంగాధరరావు మరియు నారాయణరావుల ఆశీర్వాదాలను అందుకున్నారు నిర్మాత సుబ్బారావు; హిందీలో విజయ ఢంకా మ్రోగించిన 'వక్త్' చిత్రాన్ని పేకేటి దర్శకత్వంలో తెలుగులో నిర్మిస్తున్నారు; ముఖ్య పాత్రలను గుమ్మడి, కృష్ణ, సత్యనారాయణ, రేలంగి, కృష్ణంరాజు, రాంమోహన్, ధూళిపాళ, కె. ఆర్. విజయ, రాజశ్రీ, ఛాయాదేవి, కె. వి. చలం, జయకృష్ణ, సవితా, సురేష్‌బాబు పోషిస్తున్నారు. సంభాషణలను పినిసెట్టి, సంగీతాన్ని ఘంటసాల నిర్వహిస్తున్నారు. మొదటి పాటను దాశరథి వ్రాసారు. రికార్డింగు మొదటివారంలో ప్రారంభమౌతుంది. షూటింగు అక్టోబరు రెండవ వారంలో ప్రారంభమై ప్రతి నెలా పది రోజులపాటు జరిగి ఫిబ్రవరి 26 న జ్యోతి పిక్చర్స్ ద్వారా మహాశివరాత్రి పర్వదినాన మన ముందు వుంటుంది అని నిర్మాత వెల్లడించారు.

—శ్రీనివాస్



'నేనే మొనగాణ్ణి' లో షీలా, రామారావు.

## అవీ-ఇవీ...

### అనిరుద్ర ఆర్కెస్ట్రా సరస్వతీపూజ మహోత్సవం

అనిరుద్ధ ఆర్కెస్ట్రావారు దసరా పండుగ సందర్భంలో మద్రాసు హోటల్ అశోకాలో సరస్వతీ పూజ జరుపుకున్నారు. ఉత్సవానికి డాక్టర్ పి. వి. రాజమన్నార్ అధ్యక్షత వహించారు. అతిథులకు శ్రీ సదాశివరెడ్డి స్వాగతం పలికారు. తబలా విద్వాన్ శ్రీ లక్ష్మణరావుకు పట్టు పీతాంబరాలు కప్పి అధ్యక్షులు సత్కరించి శుభాశీస్సుల నందజేశారు.

ఆర్కెస్ట్రా సంగీత కచేరీ శ్రీ శ్రీపతి ప్రార్థనతో ప్రారంభ మైంది. మాస్టర్ వేణు లహరిపై శ్రీ లక్ష్మణరావు తబలాతో సభికులను సమ్మోహపరిచారు. ప్రముఖ సంగీత దర్శకులు శ్రీ సాలూరి రాజేశ్వరరావు, పి. బి. శ్రీనివాస్, బెంగుళూరు లత, బసవేశ్వర్, కామేశ్వరరావు, సూరెళ్ల వెంకటేశ్వర్లు, ఎడ్విన్ మొదలైనవారు పాటలు పాడి ప్రేక్షకులను ఉత్సాహపరిచారు. నిర్వాహకులకు శ్రీ అనిరుద్ర కృతజ్ఞతలు తెలియపర్చారు. కార్యక్రమా నంతరం శ్రీ ఆర్. కామేశ్వరరావు వందనసమర్పణ చేశారు. (ఒ. వి.)

### బ్రిగేడియర్ డొక్కా సత్యనారాయణ

డొక్కా సత్యనారాయణగారి పెద్ద కుమారుడు. తూర్పు గోదావరిజిల్లాలో 1922 సెప్టెంబరు 22 న జన్మించారు. మద్రాసు పి. యస్. హైస్కూలు, గిండీ ఇంజనీరింగ్ కాలేజీలోనూ విద్యాభ్యాసం.



డొక్కా సత్యనారాయణ

1943 లో ఆర్మీ (ఇ. ఎమ్.)లో చేరారు. రెండవ ప్రపంచ యుద్ధం ఆఖరున బర్మాలోకూడా పనిచేశారు. ఇరవయ్యైదు సంవత్సరాల అకుంఠిత సేవ అనంతరం 1968 ఆగస్టు 18 న మరణించారు.

### ట్రేడ్‌మార్కు కేసు

పార్లే ప్రాడక్ట్స్ ప్రయివేట్ లిమిటెడ్‌వారు తమ సుప్రసిద్ధమయిన 'గ్లూకో' బిస్కట్లని ఎన్నోరకాల పాకింగులలో అమ్ముతున్నారు. 'పార్లే' అనే ట్రేడ్‌మార్క్‌నీ, వివిధమయిన పొట్లాల కాయితాలనీ కూడా రిజిస్టర్ చేయించారు. ఈ రెంటినీ కొన్ని బిస్కట్ ఫ్యాక్టరీలవారు అనుసరించి తక్కువ రకం బిస్కట్లని 'పార్లే' బిస్కట్ల కింద అమ్మ చూస్తున్నారుట.

ఇటీవల 'పెర్ల్ గ్లూకోస్ బిస్కట్ల'నేవి పార్లే గ్లూకో పొట్లాన్ని పోలిన పొట్లాలలో అమ్మకానికి ఉన్నట్లు పార్లే ప్రాడక్ట్స్‌వారు తెలుసుకున్నారుట. అందుచేత వారు రాజకమల్ ప్రాడక్ట్స్ వారి భాగస్వాముల మీద దావా వేశారుట. నాగపూర్‌లో 19 వ తేదీన జుడిషియల్ ఫస్ట్ క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టులో వేసిన ఈ దావాకి ఆ న్యాయాధికారి ఈ రకం అనుకరణ పొట్లాల కోసం వెతికించారుట. 'పెర్ల్ గ్లూకోస్ బిస్కట్ల' పొట్లాలని పోలీసు అధికారులు స్వాధీనం చేసుకున్నారుట.

—ఒ. వి.

* * *

ఇటీవల ప్రఖ్యాత నటుడు అక్కినేని నాగేశ్వరరావు 45 వ జన్మదినోత్సవం విజయవాడ అన్నపూర్ణా ఆర్ట్స్ అసోసియేషన్ వారు అత్యంత వైభవంగా జరిపారు. —ఒ. వి.

ఆటలు

# చూపరుల కోపం



జనవరి 1, 1967 భారత క్రికెట్ చరిత్రలో దుర్దినమయితే అక్టోబరు 1, 1968 మదరాసు క్రికెట్ చరిత్రలో దుర్దినం 1967లో భారతదేశాన్నిపర్యటిస్తున్న వెస్ ఇండీస్ బృందం వారు ఆడటం మానుకుని ఇంటికి వెళ్లిపోవలసిందే. సహృదయులు కాబటి జరిగిన అవమానకరమయిన సంఘటనలని మర్చిపోయి తమ పర్యటనని కొనసాగించారు.

సాధారణంగా మదరాసు ప్రేక్షకులు మంచివారని పేరు. ఆటలోని కిటుకులు, సూక్ష్మాలు బాగా తెలిసినవారని అందరూ అంటారు. అంతేకాక పక్షపాత బుద్ధి ప్రకటించరని కూడా పేరు సంపాదించుకున్నారు. ఇక వెస్ ఇండీస్‌లో అంపయిర్ల నిర్ణయాలు నచ్చని ప్రేక్షకులు పెద్ద అల్లర్లు మొదలు పెడుతూ ఉంటారని మనం వార్తలలో చదువుతూ ఉంటాము, ఇటువంటి వార్తలు మదరాసులో కోపం, ప్రతీకార వాంఛని చెలరేగ నివ్వలేకపోయాయి సరికదా ఇక్కడికి వచ్చిన వారిపట్ల ప్రత్యేకంగా మర్యాదతో ప్రవర్తిస్తారు. పోయిన వారం ఫుట్‌బాల్ పోటీలని గురించి రాస్తూ ఈ గుణాన్ని పొగిడాను.

కాని, పోయిన వారమే ఒక బాధాకరమయిన సంఘటన కూడా జరిగింది. 'బుచ్చిబాబు మెమోరియల్ క్రికెట్' పోటీలో ఫయినల్స్‌లో మెడ్రాస్ క్రికెట్ ఎసోసియేషన్, జాలీ రోవర్స్ బృందాలు ఆడాయి, మధ్యాహ్నం భోజనం తర్వాత ఆట ఆపివెయ్యవలసి వచ్చేటంత పరిస్థితి ఏర్పడింది. చూపరులలో కొందరు చీపాక్ ప్లేయింగ్ గ్రవుండ్ మధ్యకి దూకి అంపయిర్‌ని తరిమారు. దీనికి కారణం ఆ అంపయిర్ ఎమ్. సి. ఏ.కి చెందిన శ్రీధర్ అనే బాట్స్‌మన్‌ని 'రన్ అవుట్' అన్నాడుట. అంపయిర్‌ని తరమటమే కాక ప్రేక్షకులు రోవర్స్ జటు వారి గుడారాన్ని కూడా పీకి పారేశారు.

మెరీనా మయిదానంలో ప్రేక్షకుల ఉత్సాహం ఆటని కొంచెం భంగపరచటం ఉంది, చేపాక్‌లోనూ కొందరు ఆటగాళ్లని కొందరు చూసేవారు వెక్కిరించటమూ ఉంది. కాని, ఇలా 'రంగభూమి' లోకి దూకి అఘాయిత్యాలు చెయ్యటం మదరాసుకి ఇదే మొదటిసారి.

ఆట ముగిసిన తర్వాత అభిమానులు క్రీడాకారులకి మాలలు వెయ్యటానికి పరిగెత్తుకుని వస్తూ ఉంటారు. దీనినే ఆపటానికి ఎమ్. సి. సి. ప్రయత్నించింది. ఈ దౌర్జన్యం గురించి అసలు ఏమి చెయ్యగలదు!

ఇది మదరాసుకి చెడ్డ పేరు తీసుకువచ్చింది. అంపయిర్లు కూడా మానవ మాత్రులే. తప్పులు చేస్తూ ఉంటారు. అందుకని వారిని ప్రేక్షకులు దండించటం సబబేనా? అసలు ఇది శాంతిభద్రతలకి సంబంధించిన విషయం కాదా? అధికారులు ఇటువంటి ప్రమాదాలు జరగకుండా బందోబస్తు చేయించాలి. పోలీసు వారి సాయం తీసుకోవాలి. అప్పుడే ఇటువంటి దురాచారాలు ఆగిపోతాయి.

— కె. ఎస్. వరసింహన్

# శ్రీశైలం ప్రాజక్టు

(13వ పేజీ తరువాయి)

13.8 కి. వా. నుంచి 220 కి. వా కి విద్యుచ్ఛక్తిని హెచ్చించటానికి.)

శ్రీశైలం అతిప్రాచీన పుణ్యతీర్థం. నేడు అక్కడికి కర్నూలునుంచీ, విజయవాడనుంచీ కూడా బస్సుమీద వెళ్లవచ్చు., లేదా మార్కాపూర్‌దాకా రయిలు మీద వెళ్లి అక్కడినుంచి బస్సులో ప్రయాణం చెయ్యవచ్చు. నాగార్జునసాగర్ శ్రీశైలాలని కలిపేరోడ్డు కూడ తయారయింది. ఈరోడ్డు నిడివి 110 మయిళ్ళు. ఆనకట పయి ఎత్తు సుమారు 900 అడుగులు. ప్రస్తుతం 'కాఫర్ డామ్' నిర్మిస్తున్నారు కాబట్టి కృష్ణానదీ ప్రవాహాన్ని ఒకవయిపు 30 అడుగుల వెడల్పు గొట్టం ద్వారా మరొకవయిపు 50 అడుగుల వెడల్పు కాలువద్వారా మళ్లిస్తున్నారు.

ఈ కాఫర్‌డామ్ నిర్మాణం ఎంతో క్లిష్టమయినది. వానాకాలంలో వచ్చే నీటి ప్రవాహం ఎంతో ప్రమాదకరమయినది. కాని, శ్రీశైలం ప్రాజకు ఇంజనీర్లు ఎంతో నేర్పుతో ఈ సమస్యని పరిష్కరించారు.

ఇక ఆనకట పూర్తి అయిన తర్వాత 90 గ్రామాలు, 100000 ఎకరాల భూమి మునిగిపోతాయి. దీనివల్ల సుమారు 10,000 కుటుంబాలు కదలవలసి రావచ్చు. వారందరికీ తగిన ఏర్పాట్లు అధికారులు చేస్తున్నారు. ఇక ఆనకట ప్రదేశంలో 15000 జనాభా కల ఊరు ఒకటి కుడివయిపున తయారయింది! వీరికోసం 1550 క్వార్టర్సు, 30 మంచాల ఆసుపత్రి, ఉన్నత పాఠశాల, తపాలా ఆఫీసూ నెలకొల్పారు. ఇవికాక 112 మంది విద్యార్థులకి వడ్రంగం, కమ్మరిపనులలో తర్ఫీదు ఇచ్చే ఇండస్ట్రియల్ ట్రెయినింగ్ ఇన్‌స్టిట్యూట్ ఒకటి పెట్టారు. ఎడమ వయిపున 2000 మంది ఊరు వెలిసింది.

జూన్ 1968కి సివిల్ నిర్మాణాలమీద మొత్తం 19.44 కోట్ల రూపాయలు ఖర్చు అయ్యాయి. ఆనకట, పవర్‌హవుస్ 1975కి పూర్తి అవుతాయని అంచనా. కాని ఆగస్టు 1974 కే మొదటి విద్యుచ్ఛక్తి యూనిట్ పని చెయ్యవచ్చు. 4 యూనిట్లతో సహా మొత్తం ఖర్చు 74.70 కోట్ల రూపాయలు ఉండవచ్చు. వీటిమీద ఆదాయం రు 285.12 లక్షలతో మొదలయి పని అంతా ముగిసిన తర్వాత 2255 62 లక్షల రూపాయలదాకా పెరగవచ్చు. అంటే పెట్టుబడి మీద 28.1బి శాతం ఆదాయం అన్నమాట.

ఈ ప్రాజకుకి కావలసిన సాంకేతిక వివరాలన్నీ భారతీయులే తయారు చేశారు.

(ఒ. వి.)



ఈ సంవత్సరం బ్రిటన్‌లో జరిగిన లాంగ్ జంప్ పోటీలలో 20 అడుగుల 8½ అంగుళాల దూరం దూకి విజయాన్ని సాధించిన ఆన్ విల్సన్

# ధర్మపథం

(16-వ పేజీ తరువాయి)

చెప్పాడు. 'నీ పని నువ్వు చేశావన్న మాట' అని ఆయన చురచురా చూశాడు. ఆ పుష్పలావి ఏమి జవాబు చెప్పగలడు ?

అతడు కొంచెం తలెత్తి చూడగా, మాలికా రహితమైన దేవుని విగ్రహం తనపై విరుచుకు పడుతున్నట్లు కానవచ్చింది. ఇంతలో ఎవ్వరో పెద్ద పళ్లెంలో పరిమళిస్తున్న పూలదండలను తెచ్చి, విగ్రహాన్ని అలంకరించాలని అర్చకుణ్ణి ప్రార్థిస్తూ సమర్పించాడు. తిరిగి చూసేసరికి ఆ వ్యక్తి కానరాలేదు.

అదిచూచి, అక్కడివారు ఆశ్చర్యపోయారు ! అది భగవద్విలాసమే అని నిశ్చయించారు.

ఆ పుష్పలావి పరాభవంతో కుంగిపోయాడు.

'భగవద్విషయంగా చేసే ఏ పని అయినా నా పనే ; అది నా పని కాదని యికెప్పుడూ అనుకోను' అని మనస్సులోనే అతడు గొణుగుకొన్నాడు.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

మీరు ఎన్నుకొనిన మరుక్షణంలోనే – ఇది ఎప్పటికీ మీస్వంతమై పోవుచున్నది.

# ORWO FILMS

కెమేరాలో అర్ఓ ఫిల్ముతో జీవితంలోని క్షణభంగురమైన సన్ని వేశాలను బంధించండి. దీనియొక్క అతిచక్కని ఫైన్ గ్రైన్ మరియు యితర పథార్ధములతో యేవిధమైనట్టి సంబంధములేకుండా స్వేచ్ఛత నొసగుచూ ఎంత హెచ్చు లెన్సు యొక్క శక్తిని గైకొనవలెనో అంతవరకూ తనతీక్షణను ఆకర్షణద్వారా గైకొనుచున్నది



Distributors **ORWO FILMS EASTERN UNIT, Madras and Calcutta**
**ORWO PRIVATE LTD, Bombay and Delhi**

Manufactured by **VEB FILMFABRIK WOLFEN, THE GERMAN DEMOCRATIC REPUBLIC**

JAISONS 4768

తల్లి దండ్రి తోడ చెల్లెలి తోడ
కొడుకు తోడ కన్నకూతురు తోడ
కలసి చూడవలసిన కమనీయ చిత్రము



కౌముదీ వారి

# కలసిన మనసులు

దర్శకత్వం K కామేశ్వరరావు B.A./నిర్మాత M S రెడ్డి

కథ-స్క్రీన్ ప్లే M S రెడ్డి/మాటలు ఆత్రేయ/సంగీతం వేణు/కెమెరా శేఖర్ సింగ్

కళ రాజేంద్రకుమార్ B A /కూర్పు B గోపాలరావు

ఆంధ్ర, సీడెడ్ విజయ కంబైన్స్
నైజాం: దివ్యదత్త